FIRST EDITION
DEC. 1958 - 5000
PRICE Rs. 1-25

BRIDGE OF SAN LUIS REY

By THORNTON WILDER



Published under the auspices of the Southern Languages Book Trust, Madras.
Translated by : Nanduri Vithal.
Published by : Desi Kavita Mandali, Buckinghampet, VIJAYAWADA - 2.

Printed at Desi Press. Vza — 2.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోప యోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప చేసింది. ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరి కొన్ని పుస్తకాలను వివిధ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబం ధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహా నాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం మహా పురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్ని పాట్లు పడినది ముందు తరాల వారింకా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వ శాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం — ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం.

నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహాములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవు. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యాపరంపరలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, జ్ఞాన పిపాసను తృప్తి పరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందచేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు
7-10-1958

ఇట్లు,
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్.
వైస్ ఛాన్సలర్
మద్రాసు విశ్వవిద్యాలయం.

# గ్రంథం - గ్రంథకర్త:

1774 జూలై 20 న పెరూ దేశంలో చాలా అందమైన వంతెన ఒకటి హఠాత్తుగా కూలిపోయింది. ఆ సమయంలో ఆ వంతెనమీద నడుస్తున్న ఐదుగురు ప్రయాణీకులు నదిలోపడి మరణించారు. ఈ దుస్సంఘటనను స్వయంగా చూసిన క్రైస్తవ మతబోధకుడు జూనిపర్ మానవ జీవితంలో భగవల్లీలా విలాసాన్ని స్పష్టంగా రుజువుచేసి చూపడానికి ఈ విషాదసంఘటన తనకు బాగా ఉపకరిస్తుందని నిశ్చయించుకున్నాడు. ఆ అయిదుగురి రహస్య జీవితాలను గురించి పరిశోధనలు జరిపి, వారు నాడు ఆ విధంగా దారుణ దుర్మరణానికి గురికావాలన్న భగవన్నిర్ణయాన్ని వివరిస్తూ, సాక్ష్యాలతో సహా అంతా వ్రాసిపెట్టాడు. అయితే ఈ పరిశోధన సాగించిన జూనిపర్ భగవద్విరోధి అని చర్చి తీర్పు చెప్పింది. జూనిపర్ మందహాసంచేస్తూ అగ్ని ప్రవేశం చేశాడు.

ఆ ఐదుగురి జీవితాలలోని మధుర రసబంధురమైన గాథలు, జీవిత తత్త్వాన్వేషణా పరుడైన జూనిపర్ దురంతం ఈ గ్రంథంలో సరళభాషలో సహజంగా చిత్రితమైనవి.

ఈ గ్రంథకర్త థార్నటన్ వైల్డర్‌కి చిరంతనమైన కీర్తిని తెచ్చిపెట్టిన ఈ గ్రంథం నవల కాదు, తత్త్వోపదేశక గ్రంథం కాదు, గద్య కావ్యం కాదు. వాటి అన్నిటికన్న భిన్నంగా పాఠకుని మనస్సును ఆకట్టి, అంతర్ముఖుని చేయగల అపూర్వ రచన.

ఆ ఉద్గ్రంథానికి ఇది శ్రీ నండూరి విఠల్ గారి సరళమైన స్వేచ్ఛానువాదం.

—సంపాదకులు

## గ్రంథాన్ని గురించి....

1714 జులై 20 న, లైమా, కుజ్కోల మధ్య రహదారిపైన ఉన్న ఒక ప్రసిద్ధ స్తంభాలవంతెన విరిగిపోయింది. ఆ తరుణంలో వంతెనమీద ఉన్న అయిదుగురు వ్యక్తులు దిగువఉన్న అగాధంలో పడిపోయి తక్షణమే అసువులుబాశారు. అదే సమయాన వంతెన వైపుకు నడచివస్తున్న ఒక మతగురువు ఈ విషాద దృశ్యాన్ని కళ్ళారా తిలకించడం జరిగింది. స్వతహాగా ఆలోచనాపరుడు కావడంవల్ల ఆయన మనస్సుకొకటి తట్టింది—ఈ విషాద సంఘటన ఈశ్వరవిలాసాని కొక నిదర్శనంగా కనుపించింది. విశ్వాన్ని నడుపుతున్న ఆ సృష్టికర్త సమస్తమునకూ సాక్షీభూతుడుగా ఉన్నాడని తెల్పుటకే ఈ సంఘటన జరిగిందని ఆయనకు తోచింది. అంచాత ఆయన ఆ అయిదుగురి జీవితాలను అన్వేషించాడు. ఈ గ్రంథంలో కడపటవచ్చే అధ్యాయాలు విశిష్టమైన వచనంలో వ్రాయబడినవి. పైన చెప్పిన అయిదు పాత్రల అంతఃప్రవృత్తులను, ఉద్వేగాలను రచయిత మన హృదయాలకు హత్తుకపోయేటట్లు, మనలను చకితులను కావించేటట్లు ఎంతో ఉదాత్తంగానూ, స్వచ్ఛంగానూ చెప్పి ఆ అయిదుపాత్రలకూ శాశ్వత్వం కల్పించాడు.

కేవలం ఎంతో గంభీరంగా సాగిన రచన కావడం వల్ల కాక, రచయిత సాధించిన ఇందలి ఉదాత్తమైన పరిపూర్ణమైన పాత్ర చిత్రణవల్లనే ఇది ఒక గొప్ప గ్రంథంగా రూపొందింది. ఏమాత్రం సానుభూతి చూపని, ప్రతి స్పందనలేని తన కుమార్తెకు నిష్ప్రయోజనంగా జాబులు వ్రాసి, తన అనురాగాన్ని వ్యర్థం చేసుకున్న అసౌఖ్యజీవి మార్క్వెసా డిమాంటిమేయర్‌ను ఒకపట్టాన మనం మరచిపోలేము. అట్లాగే ఆమెను నమ్ముకుని, ఆమె సంరక్షణ క్రిందఉన్న ముద్దులు మూటకట్టే కుర్రవాడు పెపీటాను, కవలపిల్లలలో ఒకడైన మాన్యుయేల్ చనిపోగా, జీవించిఉండి, జీతంలో ఆధారం కానని ఈ స్టైబెన్‌నుకూడా మనం విస్మరించలేము. వీరందరికీ కూలిపోయిన వంతెన మృత్యుముఖం అయింది. ఆ మృత్యుముఖంలో వీరంతా కలుసుకున్నారు. ఇది ఎంతో తార్కికంగా—ఇలా జరగడం చాలా సహజం అన్నట్లు కనుపిస్తుంది. ఈ గ్రంథంలో మరొక విశిష్టమైనపాత్ర 'అంకుల్ పియో'. లలితకళల విషయంలో ఇతనికి గొప్ప వివేచనాశక్తి ఉన్నది. సౌందర్యవతులైన స్త్రీలపట్ల ఇతనికి అత్యంత భక్తిశ్రద్ధలున్నాయి. వారికి తన జీవితం అంకితం చేయాలనుకునేవాడు. వారు తమ సౌందర్యాన్ని, కీర్తి ప్రతిష్ఠలను కోల్పోయి, పతనావస్థ చెందినతరువాతకూడా వారిపట్ల అలాగే భక్తిశ్రద్ధలను అట్టిపెట్టుకుని ఉండడం అతనిలో గొప్ప విశేషం — అలా అట్టిపెట్టుకుని,

అభినేత్రి 'కెమిూలా పెర్కోల్'కి ఏకపుత్రుడైన 'డాన్ జైమ్'కు విద్యాబుద్ధులు గఱపి పెంచి పెద్దవాణ్ణిచేయ బూనుకున్నాడు—— బహుశా అన్ని సంఘటనలకంటే బలంగా హృదయాన్ని ద్రవీభూతం కావించే సంఘటన ఇది. ఈ అయిదుగురు వ్యక్తులూ వంతెన ప్రమాదానికి ఆహుతి అయినవారే.

నేను చిన్నవాణ్ణిగా ఉన్నప్పుడు - నా ఇరవై రెండవయేట తొలిసారిగా ఈ గ్రంధం చదివాను. అప్పుడే ఇది నా మనస్సులో ఒక స్పష్టమైన ముద్ర వేసింది. తిరిగీ దీనిని ఇటీవల చదివాను. అయిదుగురికీ సంబంధించిన ఈ విషాదాంత నాటకంలో పూర్తిగా మునిగిపోయాను. ఇందలి మృదులభావాలు, నిగూఢ మైన అర్థాలు, సున్నితము, ధ్వనిపూర్వకము అయిన హాస్యం —— ఇవన్నీ నన్ను చకితుణ్ణి కావించాయి; నిర్ఘాంతపోయేటట్లు చేశాయి. పాఠకుడికి ఈ ఆహ్లాదాలన్నీ కలగడమేకాక, ఈ రచన వెనకాల మరొక విశేషం కూడా ఉన్నది. అదే మానవ ద్వేషం —— ఈ విషాద సంఘటనలో ఈశ్వరుడి ప్రమేయం ఏమున్నదని సాహసంతో ప్రశ్నించి, విచారణకు పూనుకున్న జూనిపర్ సోదరుడికి ఉరిశిక్ష పడింది. భిన్నమతావలంబకుడైన అతను స్తంభానికికట్టి కాల్చి చంపబడ్డాడు. 'భగవంతుడి మీాద నమ్మకం ఉన్నవాడికి విచారణతో పనిలేదు' అని వక్కాణిస్తూ చర్చి, తన విశేషమైన వివేకం ఉప

హోమించి అతన్ని కాల్చిచంపింది. "జూనీపర్ సోదరుడు మందహాసం చేస్తూ అగ్నిజ్వాలలకు ఆహుతిఅయినాడు"

బలీయమైన గ్రీకు విషాదాంత రచనలకు చెందినది ఈ గ్రంథం. ఇది మనలో అత్యంత భీతావహాన్ని, అనుకంపనను రేకెత్తించి మనలను తాళితం చేస్తుంది. అంతేకాదు, విప్పిచెప్పబడిన వ్యక్తిగత విషాదాల తాలూకు మహత్తరమైన, ఎన్నటికీ చెరిగిపోని, చెరపరాని ముద్రను మన మనస్సుల్లో విడిచి వెడుతుంది ఈ గ్రంథం.

మద్రాసు
12–మే–1958

యస్. కె. చెట్టూర్.

## ప్రమాదమేమో!

అది 1714 వ సంవత్సరం జూలై నెల 20 వ తారీఖు శుక్రవారం. ఆనాటి మధ్యాహ్నం పెరూరాష్ట్రములో కెల్ల అందమైన వంతెన ఆకస్మికంగా కూలిపోయింది. దాని మీద నడుస్తున్న అయిదుగురు ప్రయాణీకులు క్రిందనున్న అగాధ ప్రవాహంలో పడి మునిగిపోయారు. ఈ వంతెన కుజ్కో-లీమానగరాల మధ్యమార్గంలో ఉండేది. వందలాది ప్రజలు రోజూ ఆ వంతెనమీదుగా ప్రయాణంచేసి నదిని దాటుతూ వుండేవాళ్ళు. ఈ వంతెన ఒక శతాబ్దం క్రితం నిర్మించబడింది. ఆ నగరాన్ని దర్శించటానికి వచ్చిన యాత్రికులెవ్వరూ ఈ వంతెనను చూడకుండా తిరిగి పొయ్యేవారు కాదు. ఎండిన ద్రాక్షతీగెలకు పల్చటిచెక్కలు కూర్చి వ్రేలాడగట్టిన నిచ్చెనలా గుంటుంది ఆ వంతెన. గుర్రాలు, బండ్లు, పల్లకీలు-మొదలైనవన్నీ వందలాది అడుగులు క్రిందకుపోయి ప్రవాహం చాలా ఇరుకుగా ఉన్న ప్రదేశంలో నదిని దాటవలసి వచ్చేది. రాజప్రతినిధి, మతాధిపతి అందరు తమ సామానుల్ని ఆ ఇరుకు మార్గంగుండా పంపి తాము మాత్రం ఆ వంతెన మీదుగానే నదిని దాటుతూండేవారు. ఫ్రాన్సుదేశానికి చెందిన సెయింట్ లూయీ అనే రాజు పేరిట ఆ వంతెన నిర్మించబడింది. అవలిగట్టున గల ఒక చర్చితో బాటు అతనిపేరుకూడ ఈ వంతెనకు

రక్షగా ఉంటూ వచ్చింది. అటువంటి వంతెన యిలా కూలి పోతుందని ఎవరూ కలలోకూడా భావించలేదు. సృష్టిలోని శాశ్వతమైన వస్తువులలో ఈ వంతెనకూడ ఒకటని వారి ప్రగాఢ విశ్వాసం. ఈ ఆకస్మిక దుస్సంఘటన గురించి విన్న వారంతా చిత్రమైన అయోమయావస్థలో పడిపోయి, తాము కూడా ఆ ప్రమాదములో చిక్కుకొని ఆ ప్రవాహములో మునిగిపోయినట్లు కొన్ని క్షణాలపాటు భ్రమించటం జరిగింది. అస్పష్టంగా ఏవో మాటలను ఉచ్చరిస్తూ క్రితంసారి ఆ వంతెనను దాటిన సమయం, మళ్ళీ దాటాలనుకుంటున్న సందర్భం గుర్తుకు తెచ్చుకొని దిగ్భ్రాంతులై పోతున్నారు.

ఆవలిగట్టున చర్చిలో ఘనంగా ప్రార్థనలు జరిగాయి. మృత కళేబరాలన్నీ ఒకచోట చేర్చబడ్డాయి. ఈ విషాద సంఘటన మూలంగా ఆ నగరవాసులందరి హృదయాల్లోను ఒక రకమైన ఆత్మపరిశోధన ప్రారంభమైంది. దాసీలు తాము దొంగిలించిన ఆభరణాలను తిరిగి యజమానురాండ్ర కప్పజెప్తున్నారు. కొంపలుతీసే ఆ వ్యాపారం మానమని వడ్డీ వ్యాపారస్థులను వారి భార్యలు హెచ్చరిస్తున్నారు. వ్యాపారస్థులు మాత్రం భార్యలకు లొంగక తమకుతాము సమర్థించుకుంటున్నారు. కాని, అనేకరకాల ఉపద్రవాలను అనుభవించటం అలవాటు చేసుకున్న పీమావాసులు ఈ సంఘటనతో యింత తీవ్రంగా చలించటం ఆశ్చర్యకరమైన విషయం. సముద్రంపొంగి ఉప్పెనలు వచ్చి మహానగరాలను మట్టిపాలుచేసి పోతున్నాయి. భూకంపాలు వచ్చి ఉన్నత సౌధాలు కూలి సజ్జనుల తలలపై బడుతున్నాయి. భయంకర

మైన వ్యాధులు విజృంభించి జనాళిని పీడించి నాశనం చేస్తున్నాయి. మహాపురుషు లెందరో జరత్వానికి లొంగి కాలగర్భంలో కలిసిపోతున్నారు. ఇన్ని ఉపద్రవాలను చవి చూసిన పెరూలియన్లను ఈ సంఘటన యింతగా చలింప చేయటం ఆశ్చర్యంగానే కనిపిస్తూంది.

ప్రతివారు విచిత్ర భావనా సముద్రములో మునిగి పోయారు. కాని ఒక వ్యక్తిమాత్రం నిర్లిప్తంగా వూరుకో లేక పోయాడు. అతని పేరు జూనిపర్. సెయింట్ ఫ్రాన్సిస్ అనుయాయుడైన ఇతడు ఉత్తర ఇటలీనుండి మత ప్రచార మునకై పెరూ రాష్ట్రానికి వచ్చాడు. అసాధారణంగా కల సిన అనేక సంఘటనలను బట్టి దైవనిర్ణయం ప్రకారమే ఈ ప్రమాదం జరిగిందని ఎవరికైనా అనుమానం కలుగుతుంది.

ఆ రోజు మధ్యాహ్నం నిప్పులు చెరిగే ఎండ కాస్తు న్నది. ఆ వంతెనకు కొంతదూరంలో గల ఒక కొండ ప్రక్క నుంచి నడచివస్తున్న జూనిపర్ చెమటపట్టిన నుదుటిని తుడుచు కుంటానికి ఒక నిముషం ఆగి దూరంగా నిశ్చలంగా నిద్ర పోతున్న పర్వత శిఖరాలకేసీ, ఆ తరువాత పచ్చనిఆకులలో, పక్షుల ఈకలతో నిండిఉన్న లోయలోకీ తేరిపారచూశాడు.

జూనిపర్ హృదయంలో ఆనందం ఉరకలు వేస్తు న్నది. పరిస్థితులు చాలా అనుకూలంగా మారుతున్నాయి. అనేక చర్చిలను పునరుద్ధరించి అనేకమంది ప్రజలను తన మతములోనికి తీసుకొని రాగలిగాడు. ఈ సంతోషంతో మెరుస్తున్న జూనిపర్ చూపులు ఆ వంతెనమీదకు ప్రసరిం

చాయి. పాడుబడిన గదిలో వీణె తీగెలు పుటుక్కున తెగి నట్లు ఏదో ఒక శబ్దం అతని చెవుల సోకింది. ఎదురుగాగల వంతెన కూలి పోతున్నది. దానిమీాద చీమల్లా ప్రాకుతున్న అయిదుగురు ప్రయాణీకులు క్రిందగల అగాధ ప్రవాహంలో మునిగి పోతున్నారు.

ఈ దృశ్యం మరెవరు చూసినా ఒక నిగూఢమైన ఆనందంతో "పది నిముషాల్లో నేను కూడ... ..." అని అనుకోవటం జరిగేది. కాని ఈ విషాద సంఘటని చూచిన క్షణంలో జూనిపర్ స్మృతి పథంలో మెరసిన భావన అటు వంటిది కాదు.

"ఈ అయిదుగురికి ఈ ప్రమాదం ఎందుకు జరిగింది?"

సృష్టిలో జరిగే ప్రతి సంఘటనకు ఒక పథకం అంటూ ఉంటుందా? దాని ప్రకారమే ఈలోకం తిరుగు తూందా? అదే నిజమైతే ఈ అయిదుగురు దురదృష్టవంతుల జీవితాలను పరిశీలించి అందు నిక్షిప్తమైన రహస్యాన్ని కని పెట్టవచ్చునేమో! మనము ప్రమాదవశాత్తు జన్మించి అలాగే మరణిస్తున్నామా? ఒక దైవ నిర్ణయాన్ని అనుస రించి కారణ జన్ములమై - అదే నిర్ణయప్రకారం పంచ భూతాల్లో లీనమైపోతున్నామా? ఏమిటీ సృష్టి రహస్యం?

తత్క్షణం జూనిపర్ ఒక నిర్ణయానికి వచ్చాడు. ఈ అయిదు ప్రాణుల రహస్య జీవితాలు పరిశోధించి ఈ సంఘట నకు గల కారణాన్ని కనిపెట్టాలని నిశ్చయించు కున్నాడు.

♦ ♦ ♦ ♦

పదార్థ విజ్ఞానముకంటె పరిపూర్ణ శాస్త్రీయ విషయాల కోవలో తాత్విక శాస్త్రాన్నికూడా జేర్చవచ్చునని జూనిపర్ విశ్వాసం. కాని అందుకు తగిన పరిశోధనలుచేసి ఫలితాలను నిరూపించటానికి రంగస్థలం జూనిపర్‌కు లభించలేదు. తన ఆశ్రయంలో ఉంటున్న దీనులెందరో అనేకరకాల మహో పద్రవాలకు ఎరై పోతున్నారు. విషజంతువులు కాటువేయగా కొందరు, క్షయవంటి భయంకర వ్యాధులు సోకి కొందరు, అగ్నిప్రమాదాలకు గురియై సర్వనాశనమైన మరికొందరు కడుపున పుట్టిన బిడ్డల విషాద జీవితాలను చూచి కొందరు – అనేక విధాలుగా అనేకమంది దురదృష్టాలను స్వీకరిస్తు న్నారు. కాని ఈ ఉపద్రవాలను శాస్త్రీయంగా పరిశో ధించటం ఏలాగు? సాధారణంగా మానవుడు చేసిన తప్పిదాలే ఈ ఉపద్రవాలకు కారణ మౌతున్నాయి. కనీసం అలా అనుకుంటానికి అవకాశమిస్తున్నాయి.

కాని, సెయింట్ లూయీ రే వంతెన కూలిపోవ టానికి నిస్సంశయముగా దైవనిర్ణయమే కారణం. అందు చేత జూనిపర్ చేయదలచుకొన్న పరిశోధనకు కావలసిన రంగస్థలం ఈ విషాద సంఘటనతో బద్ధమైనది. ఈ ఉపద్ర వానికి కారణభూతమైన భగవానుని ఉద్దేశం ఈ పరిశోధ నతో కనిపెట్టవచ్చును. ఈ ఊహ జూనిపర్‌కు గాక మరెవ రికి తట్టినా తాత్విక తర్క ప్రభావమని అనిపించేది. బైబిల్ కథప్రకారం పతనమైన దేవతలు స్వర్గారోహణకై బాబిల్ శిఖరాన్ని నిర్మించటానికి చేసిన విఫలయత్నంలో దీనిని పోల్చి ఉండేవాళ్ళం. కాని జూనిపర్ విషయం

కాదు. ఈ పరిశోధనగురించి అతనికి ఆవంతకూడా సందేహం లేదు. పరిశోధనా ఫలితమేమిటో అతనికి పూర్తిగా తెలుసు. తన మతంలో ఇప్పుడిప్పుడే జేరుతున్నవారికి ఒకసత్యాన్ని నిరూపించటానికే ఈ పరిశోధన చేస్తున్నాడు. ఇటువంటి రుజువులు లేని ఏ విషయాన్ని వారు నమ్మరు. జీవితంలో సుఖాలతోపాటు కష్టాలనుకూడ మన మంచికే భగవంతుడు ప్రసాదిస్తున్నాడని ఉత్తమాటలతో చెప్పితే వారునమ్మరు. "నువ్వు చెప్పేది నిజమనటానికి సాక్ష్యమేమిటయ్యా?" అని ఎదురుప్రశ్న వేస్తారు. అసలు మానవ హృదయంలోనే ఇలాంటి సంశయాలు అనంతంగా ఉంటాయి. అక్కడేకాదు మరింత పుతచైతన్యంగల దేశాల్లోకూడా ఇదే విషయం కనిపిస్తుంది.

జూనిపర్ జీవితంలో ఇట్టివే అనేక ప్రయత్నాలు చేశాడు. ఒక ఊరినుండి ఒక వూరికి మత ప్రచారానికై సుదీర్ఘ ప్రయాణాలు చేస్తూ దుస్తులను ఎగదీసి కట్టుకొని తొట్రుపాటుతో నడుస్తూ ఎన్నో కలలు గనేవాడు. భగవంతుడు మానవాళికి ప్రసాదిస్తున్న మంచి చెడ్డలు రెండూ సరియైనవే అని నిరూపించాలి!

ఉదాహరణకు: అనావృష్టితో దేశం సంభిక్షిస్తున్నప్పుడు జూనిపర్ దైవప్రార్థనలు చేసేవాడు. అతని అనుయాయులందరూ మండుతున్న నేలపై మోకరిల్లి ఉండగా తాను చేతులు పైకెత్తి పవిత్ర మంత్రాలను బిగ్గరగా ఉచ్చరించేవాడు. ప్రతిసారీ కాకపోయినా, అనేక పర్యాయాలు భగవంతుడు కరుణించాడు. ఆకాశంలో దూరంగా మెరు

స్తున్న మబ్బు తునక కనిపించేది. అలాగే అనేకసార్లు... వారాలు గడచినా... ...అలాంటి వాటిని గురించి మన మెందుకు చర్చించాలి? నిజానికి అతివృష్టి అనావృష్టి అన్నీ సమపాలుగానే భగవంతుడు ప్రసాదిస్తున్నాడు.

ఆ దుస్సంఘటనచూసిన జూనిపర్ మనస్సు ఇటువంటి ఆలోచనలతో నిండిపోయింది. ఒకనిర్ణయానికివచ్చి తక్షణం కార్యక్రమం ప్రారంభించాడు. ఆతరువాత ఆరు సంవత్స రాలపాటు నిర్విరామంగా కృషిచేశాడు. పీమాలోని ప్రతి యింటి ద్వారాన్ని తట్టాడు. అనేకమందిపై వేలాది ప్రశ్నల వర్షం కురిపించాడు. డజన్లకొద్దీ పుస్తకాలు నింపాడు. గతించిన ఈ అయిదు జీవితాలు పరిపూర్ణమైనవని అతని నమ్మకం. ఈ సత్యాన్ని నిరూపించాలనే అతని ప్రయత్నం. ఈ ప్రమాదానికి స్మృతి చిహ్నంగా జూనిపర్ ఏదో ప్రయత్నం చేస్తున్నాడని అందరికీ తెలుసు. ఈ విషయంలో అందరి సానుభూతి అతనికి లభ్యమైంది. ఎవరికి తెలిసిన విషయాలను వారు వివరిస్తున్నారు. కాని ఏ రెండుమాటలకు పొందిక కుదరటంలేదు. కొంతమందికి జూనిపర్ ప్రధా నాశయ మేమిటోకూడా తెలుసు. గొప్ప హోదాగల పెద్ద మనుష్యులుకూడా అతన్ని ప్రోత్సహించారు. ఈ కృషి ఫలితంగా ఒక బ్రహ్మాండమైన గ్రంథం తయారైంది. ఆవిష్మట ఒక ప్రశాంత వసంతోదయాన అది బహిరంగంగా తగల బెట్టబడింది. కాని, దాని రహస్యప్రతి ఒకటి అదృష్టవశాన మిగిలి చాలా సంవత్సరాల తరువాత ఎలాగో రచయితకు

విశ్వవిద్యాలయ గ్రంథాలయంలోకి చేరింది. అది ధూళితో నిండిన రెండు పెద్ద కొయ్య చక్కాలమధ్య నిక్షిప్తమై పడిఉంది.

ఈ ప్రమాదానికి గురియైన వారి జీవిత చరిత్రలు అందు వరుసగా చిత్రించబడ్డాయి. వారి జీవితాలకు సంబంధించిన అనేక విషయాలు, సంఘటనలు, సాక్ష్యాలు, కథలు ఎన్నో ఉల్లేఖించబడ్డాయి. చివరకు ఒక్కొక్క వ్యక్తికీ ఆ రోజునే ఈ సంఘటన నిర్ణయించి, భగవంతుడు తన జ్ఞాన మహిమను ఎలా ప్రదర్శించాడో వివరిస్తూ ఒక ఉదాత్తమైన వ్యాసం వ్రాయబడి ఉంది. కాని, ఇంత శ్రమించినప్పటికీ జూనిపర్‌కు డోనామేరియా జీవితంలో దాగిఉన్న నిగూఢ ఆవేదన ఏమిటో తెలియదు. పిమోమామ జీవితానికి గల అర్థం - ఎస్టబాన్ జీవితరహస్యం - ఆవంతకూడ జూనిపర్‌కు అవగతం కాలేదు. ఈ విషయంలో జూనిపర్‌కంటె ఎక్కువ పరిజ్ఞానం గలదనుకుంటున్న నాకు మాత్రం ఈ అద్భుత సంఘటనలో నిక్షిప్తమై ఉన్న నిగూఢరహస్యం తెలియాలని ఎక్కడ ఉంది!

వేసవికాలంలో తూనీగలను ఆటకోసం పిల్లలు చంపుతూంటారు. అలాగే దేవతలు కూడా మానవాళిజీవితాలతో ఆడుకుంటారని కొందరంటారు. మరి కొందరు అందుకు విరుద్ధంగా భగవంతుని సంకల్పం లేనిదే గడ్డిపోచకూడా కదలదని వక్కాణిస్తారు.

## డోనా మేరియా

ప్రతి స్పానిష్ విద్యార్థి జూనిపర్ గురించి కంటే - మార్క్వెసాడి మాంటిమేయర్ - డోనామేరియాను గురించే ఎక్కువ తెలుసుకోవాలి. ఇది అనేక సంవత్సరాల పరిశోధనల వల్ల గాని తెలియదు. ఆమె మరణించిన శతాబ్దం లోపల ఆమె లేఖలు స్పానిష్ సాహిత్యంలో చిరస్మరణీయమైన స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. నాటినుంచి ఆమెజీవితం, అప్పటి స్థితి గతులు పఠనీయమైన విషయా లయ్యాయి. ఆమె లేఖలద్వారా ఆమె జీవిత చరిత్రకారులు కొందరు ఆమెను ఉన్నతంగా చిత్రించడానికి ప్రయత్నించారు. కాని జూనిపర్ ఒక విధంగా పొరబాటు చేస్తే, వీరు మరొక విధంగా తప్పుదారిని పడ్డారు. నిజానికి యీ అద్భుతమైన స్త్రీని గురించిన వాస్తవిక పరిజ్ఞానం ఆమెను కించ పరచి, ఒక్క విషయం మినహా తక్కిన అన్నివిషయాల్లోనూ ఆమె వ్యక్తిత్వాన్ని క్రుంగ తీస్తున్నది.

ఆమె ఒక బట్టల వర్తకుని కుమార్తె. అతనికి ఆక స్మికంగా నడమంత్రపు సిరిపట్టింది. దానితోపాటు ఎమియన్ల ద్వేషం కూడా అతనికి ప్రాప్తించింది. ఆమె శైశవం దుఃఖ పూరితంగా గడచిపోయింది. ఆమె కురూపి. నత్తిగా మాట్లా డేది. అందరూ ఆమెను అవమానించేవారు. ఆఖరుకు తల్లి కూడా ఆమెను కించపరుస్తూ వుండేది. కాని సంఘంలో యీ కురూపికి కొంత ఆకర్షణ కల్గించాలని, వంటినిండా నగలు పెట్టి ఊళ్ళోకి పంపుతూ ఉండేది. ఈ సౌందర్య విహీనను

రాలు ఒంటరి జీవితాన్ని గడుపుతూ, ఒంటరిగానే ఆలోచ నలను సాగించేది. అయినా ఆమెను వివాహం చేసుకోవ డానికి అనేకమంది యువకులు ముందుకు వచ్చారు. సాంఘిక సంప్రదాయానికి ఎదురు తిరిగి జీవితాంతం వరకు అవివాహి తగా నుండిపోవాలనే ఆమె విశ్వప్రయత్నం చేసింది. కాని అనేక భీభత్సకరమైన సంఘటనల తరువాత ఆమె దివాలా తీసిన ఒక భూస్వామిని వివాహం చేసికోవాల్సి వచ్చింది. ఆ వివాహానికి ఎందరో అతిథులు వచ్చారు. అమ్మలక్కల వేళాకోళాలతో, గుసగుసలతో లీమూచర్చి ప్రతిధ్వనించింది.

ఏమయితేనేం, ఆమెకు వివాహం జరిగింది. కాని దుర్భరమైన ఒంటరితనం ఆమె జీవితాన్ని విడిచిపెట్టలేదు. ఆమెకు ఒక అపురూపమైన బిడ్డ పుట్టింది. మేరియా తన జీవితంలోని ప్రేమానురాగాలను సంపూర్ణంగా ఆబిడ్డపై నిలిపింది. కాని చిన్నారి క్లేరా తల్లి విషయంలో నిర్లిప్తంగా వుంటూ— తండ్రికి సన్నిహితం కాజొచ్చింది. పాప యెంతో తెలివైనది కాని... యెనిమిది సంవత్సరాల చిరుప్రాయం లోనే ఆమె తల్లి మాటల్లోని తప్పులను వెదక మొదలు పెట్టింది. కన్నబిడ్డ విపరీత వైఖరిజూచి ఆ మాతృహృదయం ఆశ్చర్యపూరితమైన భయభ్రాంతులతో కృంగిపోయింది. భయంతోనే ఆమె బిడ్డను ప్రేమిస్తూ దగ్గరకు తీసుకోవల్సి వచ్చింది. మళ్ళీ అనేక భీభత్స దృశ్యాలు ప్రారంభ మయ్యాయి. చివరకు డోనాక్లేరా తల్లి సమక్షంనుండి విరగడైపోవడానికి వీలుగా స్పెయినులోగల ఒక పెండ్లి సంబంధానికి అంగీకరించింది. అక్కడనుంచి జవాబు రావ

డానికే ఆరుమాసాలు పట్టుతుంది. దూరతీరాలకు తరలి వెళ్లేముందు ప్రార్థనలు జరపడం పరిపాటి. పెరూలో అదే విధంగా జరిగింది. డోనా క్లేరా స్పెయినుకు వెళ్ళేముందు యిరుపక్షాలవారూ మోకరిల్లి ప్రార్థనలు జరిపారు. కాని అవి బలహీనంగా, ఆకాశంలో ప్రతిధ్వనించాయి. నౌక బయలుదేరింది. ఆశీర్వాదబలంతో ఆ నౌక సముద్ర గర్భంలోకి చొచ్చుకొని పోసాగింది. ఓడ ముందుకు సాగుతూంటే ఒడ్డు దూరమైపోతున్నది. డోనా క్లేరా హృదయం ఆనందంతో పొంగిపోయింది. డోనా మేరియా హృదయం విషాదంతో కృంగిపోయింది. చివరకు ఆ మాతృమూర్తికి ప్రశాంతమైన నీలి కెరటాలపై నింగిలో నిశ్చలమైన ముత్తెములవంటి మేఘములు లీలగా గోచరించాయి.

లీమాలో మేరియా జీవితం ఒంటరితనంవల్ల రాను రాను అంతర్ముఖం కాజొచ్చింది. వేష భాషలందు ఆమెకు గల ఆసక్తి సన్నగిలింది. తనలో తానే సంభాషించుకొనేది. ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లుచున్న మనస్సుతో ఆమె జీవితం గడప వలసి వచ్చింది. ఈ వికృత పరిస్థితిలో దగ్గర లేని తన కుమార్తెతో అనేక సంభాషణలు సాగించేది. ఆ మాటలన్నీ విషాదపూరితమైన క్షమాపణలతో నిండి వుండేవి. మళ్ళీ భీభత్సదృశ్యాలు ప్రారంభమైనాయి. వీధుల్లోకూడా ఆమె చాలా వికృతంగా కన్పించేది. తలపైన విగ్గు ఒక చెంపకు వాలిపోయి వుండేది. ఆమె బుగ్గలు ద్వేషాచ్ఛాదితమైన ప్రేమతో కంపించేవి. ఆమె కన్నీటికి అంతం వుండేదికాదు. ఆమె పెదవులు నిరంతరం ఒణుకుతున్నాయి. లీమాలో

ఉన్మాదగ్రస్థులైన దురదృష్టవంతులు లేకపోలేదు. కాని ఆమె పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది ... ... వీధుల్లో ప్రయాణం చేసేటప్పుడు, చర్చిలోకి రాకపోకలు సాగించేటప్పుడు ఆమె బాగా వెలితిపడుతూ వుండేది. ఒళ్ళు తెలియకుండా ఆమె ఎప్పుడూ తప్పతాగి వుంటుందని అందరూ అనుకొనేవారు. ఆమెను గురించి చాలా నీచంగా చెప్పుకునేవారు. ఆమెను కారాగారంలో బంధించడం అత్యవసరమంటూ దరఖాస్తులు పరంపరగా ప్రభుత్వానికి జేరుతున్నాయి. ఆమె మూడుసార్లు బహిరంగంగా విచారింపబడి అభిశపించబడింది ... ... స్పెయిన్‌లో ఆమె అల్లుడు గొప్ప పలుకుబడి గలవాడుగనుక సరిపోయింది. లేకపోతే ఆమెను నిలువునా కాల్చి చంపేవారు. అంతేకాదు; వైస్‌రాయ్ కొలువులో ఆమె కొందరు స్నేహితులను సంపాదించడం కూడా ఇందుకు తోడ్పడింది ... ... ఈ పరిస్థితులలో తల్లి బిడ్డలమధ్య డబ్బు విషయంలో కొన్ని తగవులు వచ్చాయి. దానితో వారి సంబంధ బాంధవ్యాలు మరీ విషమించాయి. అయినప్పటికి క్లేరాకు తరచు తల్లి పంపిన కానుకలు ముట్టుతూనే వుండేవి. అనతికాలంలోనే స్పానిష్ కొలువులో డోనా క్లేరా గొప్ప గౌరవ ప్రాభవాలు సంపాదించుకొన్నది. ఆమె కలలు గంటూన్న విలాస జీవితం అనుభవించటానికి పెరూలోని పెన్నిధినంతా వెచ్చించినా చాలదు. కాని చిత్రంగా ఈ దుబారాతనంవల్ల ఆమె స్వభావంలోగల ఒక ఉత్తమ గుణం పైకివచ్చింది. ఆమె బంధు మిత్రులను నౌకర్లను కన్నబిడ్డలవలె చూచుకొనేది. నిజానికి ఆమె దయా

రసానికి పాత్రురాలుకాని దురదృష్టవంతురాలు ఆమె తల్లి ఒక్కతె మాత్రమే. భౌగోళిక చిత్రకారుడు డిగ్లాసిస్, శాస్త్రవేత్త అజూరియస్- డోనాక్లేరా ఆశ్రితులలోనివారే. ఒక దశాబ్దంపాటు డోనాక్లేరా స్పెయినులోని కవి పండితుల్ని, శాస్త్రజ్ఞులను పోషించింది... కాని ఆమెహయాంలో చిరస్మరణీయమైనవి ఏవీ సాధింపబడక పోవటం ఆమెలోపం కాదు. డోనాక్లేరా కాపురానికి వెళ్ళిన నాల్గు సంవత్సరాలకు డోనామేరియూ యూరపును దర్శించటానికి అనుమతి సంపాదించింది. ఇద్దరూ తమని తాము నిందించుకొని ఇక ముందు పొరపొచ్చాలు లేకుండా వుండాలని నిర్ణయాలు చేసికొన్నారు. కాని యిద్దరూ విఫలులయ్యారు. ఒకరినొకరు వేధించుకున్నారు. ఇద్దరికీ మనస్థిమితం లేకుండా పోయింది. చివరకు డోనా మేరియూ ఒకనాటి ఉదయం అరుణోదయం కాకముందు లేచి బిడ్డముఖం చూసే ధైర్యంలేక ద్వారబంధాన్ని మాత్రం ముద్దాడి, కుమార్తె నిద్ర లేవకముందే ఓడ నెక్కి అమెరికాకు తిరిగివచ్చింది. అప్పటినుంచి చైతన్యవంతంగా జీవించలేక పోయిన ఆ తల్లి ప్రేమకు ఉత్తరాలే ఆశ్రయ మయ్యాయి.

ఆమె లేఖలను చూసి ఆ తరువాత ప్రపంచం ఆశ్చర్యపోయింది... అవి విద్యార్థులకు పాఠ్యగ్రంథా లయినాయి. వైయాకరుణులకు చీముల పుట్టలయినవి. అంతటి ఉన్నత సాహిత్యాన్ని సృష్టించగల శక్తి డోనామేరియూకు లేకపోతే ఆమె అందుకు కృషిచేసి దాన్ని సాధించి వుండాలి. తనకు దూరన్మై, దూర తీరాలలో నివసించుచున్న తన బిడ్డను ఆక

ర్శించడానికి, ఆమెపై తన అనురాగాన్ని అద్భుతంగా ప్రద ర్శించడానికి యీ కృషి అవసరమైంది. ఇందుకోసం ఆమె సంఘంలో తిరుగుతూ అందుగల లోటుపాటులను ఎన్నడా నికి, ఎంతో కృషి చేసింది. తన స్పానిష్ భాషయందుగల ఉత్తమ సాహిత్య రీతులను పరిశీలించింది... గొప్ప వక్త లుగా పేరొందినవారి సహచర్యం సంపాదించి, వారి సంభా షణల సౌలభ్యంలోని మెళుకువలను గ్రహించింది. అనేక రాత్రులు ఆమె వ్రాసిన వాక్యమునే వ్రాసి పూర్తి చేసిన పుటలనే పూర్తిచేసి అందు, తన శక్తినంతనూ వినియోగించి చమత్కార సౌందర్యములను నింపింది... ఈ లేఖలలోని మాతృహృదయాన్ని డోనాక్లెరా ఎంతవరకు పరిగ్రహించ కల్గిందో? కాని వీటిని భద్రపరచిన మేరియా అల్లునకు మనం కృతజ్ఞులమై వుండాలి.

తన లేఖలు చిరస్మరణీయము లైనవని తెలిస్తే మేరియా ఆశ్చర్యపడి వుంటుంది. కాని అనేకమంది విమ ర్శకులు, ఆమె యశస్సు నార్జించు దృష్టితో యీలేఖలను వ్రాసినదని నిందించారు. అనేకమంది కళాకారులు, ఒక వ్యక్తినిగాక యావత్ప్రపంచమును భ్రమింప జేయాలనే దృష్టితో కళాసృష్టి సాగిస్తారు. అలాగే డోనామేరియా కేవలం తన కుమార్తెను ముగ్ధురాలను చేయుడానికే యింత కృషిచేసి, సాహిత్యాన్ని సృష్టించడం అసంభవం అని వారి వాదన. డోనామేరియా అల్లుడుకూడా ఇదే విధంగా అపార్థం చేసికొన్నాడు. కాని ఈ ఉత్తరాలు అతనికి ఉల్లాసం కల్గించాయి.

ఆ శైలికి అతడు ముగ్ధుడై అందుగల ఔన్నత్యా న్నంతా తాను గ్రహించినట్లుగా భావించాడు. కాని అనేక మంది పాఠకులవలె - ఆ లేఖలందుగల మాతృ హృదయ స్పందనాన్ని అతడు గ్రహించలేదు. బలహీనమైన హేయ మైన శైలి అనే పాత్రలో విషాద నీరదాన్ని నింపి ఆమె లోకానికి అందించింది:— మేరియూవంటి రచయితలు వాళ్ళ మనోపథంలో నిర్మించుకున్న ఉత్తమ వాతావరణంలో జీవి స్తారు. వారు సృష్టించిన కళాఖండాలు మనకు అసాధారణం గానూ వారికి దైనందిన జీవితంనుంచి బయట పడటానికి సాధనాలుగాను కన్పిస్తాయి.

జరాభారంతో కృంగిపోతున్న మేరియూ ఆమె ఇంటి పంచలో గంటల తరబడి కూర్చుంటుంది. ఆమె పాలిపోయిన ముఖానికి అడ్డంగా వికృతమైన గడ్డి టోపీనీడ పడుతోంది. నిముష నిముషానికీ ఆమె వ్రాసిన పుటలను తిరుగవేస్తూ యేదో వెర్రి ఆనందంతో తన్నుతాను ప్రశ్నించుకుంటుంది. తన హృదయాంతరాళాల్లో నిరంతరం రేగుతున్న అడవి మంటలాంటి బాధకు హృదయకోశంలో ఏమున్నా దోష ముందేమో! ఎప్పటికైనా ఒక వైద్యుడు తన గుండెల్ని చీల్చి - రోగమును కనిపెట్టి "ఇదిగో! ఈ స్త్రీ బాధ పడింది. ఆమె అనుభవించిన ఆవేదన ఆమె హృదయ స్వరూపాన్ని మార్చివేసింది." అని తన విద్యార్థులకు చెప్ప గలడేమో! ఇదే అభిప్రాయం ఆమెకు పదేపదే కల్గడంవల్ల యీవిషయాన్నే తనకుమార్తెకు లేఖద్వారా తెలియపరచింది.

కాని, నిష్కారణంగా విషాదాన్ని సృష్టించుకుంటున్నందుకు శ్వేరా తల్లిని తిట్టిపోస్తూ జవాబు వ్రాసింది.

తనను ప్రేమించే హృదయం, తనకై కన్నీరు కార్చే జీవితం యీ పృథ్విలో లేదను భావం ఆమెలో పూర్తిగా వ్యాపించింది... దానిఫలితంగా కొండను ఢీకొని విచ్ఛిన్నమై పోయిన ఉత్తుంగ తరంగములవలె ఆమె భావాలు విచ్ఛి వికృతమై పోయాయి. మొదటి మతంమీద ఆమెకు గల నమ్మకాలు అదృశ్యమైనాయి. దేవుడంటూ వుంటే ఆమె ప్రార్థన ఒక్కటే... బిడ్డలు, తల్లులను ప్రేమించే లోకం తనకు కావాలి. ఆ తరువాత మానవత్వంపై ఆమెకుగల నమ్మకం నశించింది... ఎవరు ఎవరిని ప్రేమించారన్నా ఆమె నమ్మలేక పోతున్నది... అన్ని కుటుంబాలు ఒక నిరర్థక వాతావరణంలో, అనురాగ విహీనమైన చుంబనములతో సాగి పోతున్నాయి. ఈ ప్రపంచంలోని మానవులందరూ, దురహంకారంతో, పొగడ్తల నందాలన్న వెర్రి దాహంతో ఒకరు చెప్పేది వినక తమ కత్యంత సన్నిహితులైన - స్నేహితుల కెదురైన మహోపద్రవములకు చలించక స్వార్థ కాంక్షాక్రాంతులై జీవితయాత్ర గడుపుతున్నారు. పెరూలోని ఆది మానవుని కుమారులు వీరు! ఈ ఆలోచనా పరంపరలు యీ ఘట్టాన్ని సమీపించుసరికి ఆమె సిగ్గుతో కుంగిపోయింది. తనజీవితంకూడా పతితమేనని ఆమెకు తెలుసు. ఆమెకు తనబిడ్డపైగల ప్రేమలో ఉత్తమమైన ప్రేమకువుండవలసిన లక్షణాలన్నీ మూర్తీభవించినా అది నిర్మలమైన ప్రేమకాదని ఆమెకు తెలుసు. ఆమె తనకుమార్తెను ఏనాడూ

నిస్వార్థంగా ప్రేమించలేదు. తన బిడ్డను తనకోసమే ప్రేమిస్తున్నది. ఈ అపవిత్ర బంధంనుండి తక్షణం బయటపడాలని ఆమె కోరుకుంటుంది. కానీ ఈ కోర్కెను ఆమెలోని తీవ్రమైన వ్యామోహం ఎదుర్కొంటుంది. అంతట ఆమె హృదయంలో సంఘర్షణ ప్రారంభమవుతుంది. వ్యామోహాన్ని ఆమె జయించలేదు. నాలుగువేల మైళ్ళ దూరం కావాలని పారిపోయిన కుమార్తెపై తానెటువంటి అధికారాన్ని చలాయించగలదు? అనేకసార్లు డోనా మేరియా యీ వ్యామోహ పిశాచంతో పెనుగులాడాల్సొచ్చింది. కానీ ప్రతిసారీ పరాజయం ఆమెను వెన్నాడేది. తనబిడ్డ తనకు పూర్తిగా దక్కాలని కోరుకొనేది. "అమ్మా! పృథ్విలో నీయంత మంచి తల్లి లేదు" అని తనబిడ్డ తనను కౌగలించుకోవాలని ఆ మాతృ హృదయం ఉవ్విళ్లూరేది. "నన్ను క్షమించ"మను మాటలు తన బిడ్డ పెదవులపై స్పందించగా వినాలని ఆమె పరితపించేది. మేరియా స్పెయినునుంచి వచ్చిన రెండు సంవత్సరాల తరువాత అనేక స్వల్ప సంఘటనలు జరిగాయి. ఇవి మేరియా యొక్క వ్యక్తిగత జీవితాన్ని వివరించేవి. వాటినిగురించి ఆమె లేఖల్లో విశేషంగా ఉల్లేఖించలేదు...... కాని యిరవయి రెండవ ఉత్తరంలో అనేక విషయాలతో బాటు యీ సంఘటనలకు సంబంధించిన వివరాలుకూడా కొన్ని ఉన్నాయి. ఈ లేఖ యొక్క మొదటి భాగపు అనువాదాన్ని, దానిపై కొంత వ్యాఖ్యానాన్నికూడా యివ్వడానికి నేను నాశక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను.

"స్పెయినులో నీకు వైద్యుడే కన్పించలేదా! ఫ్లాండర్సునుంచివచ్చిన స్నేహితులు నీకు యెప్పుడూసహాయం చేసేవారు గదా! వాళ్ళేమయ్యారు అప్పుడు? ఓ నా వజ్రాలగనీ, శైత్యభారంతో బాధపడుతూ యిన్ని వారాల పాటు అశ్రద్ధచేసినందుకు నీ కేమి శిక్ష విధించాలి? డాన్ విసెంటీ!—నా బిడ్డకు తెలివితేటలు ప్రసాదించు. స్వర్గం లోని దేవతలారా! నా బిడ్డకు వివేకాన్ని ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను.

"ఇప్పుడే నీ ఆరోగ్యం బాగుపడివుండాలి. శైత్య భారం వచ్చే సూచన కనబడటంతోనే వెంటనే నీశరీరానికి ఆవిరిపట్టి పడుకోవటం అలవాటు చేసుకో. నే నిక్కడ పెరూలో నిస్సహాయస్థితిలో ఉన్నాను. నేనేమీ చేయలేను. అమ్మా నీ ఇష్టం నీదేనా? నామాట విను మరి......భగవంతుడు నిన్నాశీర్వదిస్తాడు. నేను ఇందుతోపాటు ఒక చెట్టు యొక్క జిగురును పంపుతున్నాను. శాంటోథామస్ సన్యాసినులు దీన్ని ఇంటింటికి తిరిగి అమ్ముతున్నారు ... ఇది నీ కేమన్నా ఉపయోగిస్తుందో లేదో నాకు తెలియదు.

"కాని దీనివల్ల అపకారం మాత్రం జరుగదు. అందు వల్ల దీనిని వాడిచూడు.

"సుఖంగా వుండు తల్లీ! పూజ్యులైన స్పెయిన్ మహా ప్రభువుకు ఉత్తమమయిన బంగారుగొలుసును పంపిస్తున్నాను."

(డోనా క్లైరా ఆమెకు యిలా వ్రాసింది—"గొలుసు సక్రమంగా నాకు చేరింది. పండుగరోజున దాన్ని నేను

ధరించాను. మహాప్రభువు యీ గొలుసును చూసి యెంతో ఆనంద పడ్డాడు. దానిని పంపినది నీవని చెప్పాను. నీకుగల ఉత్తమమైన అభిరుచికి ఆయన అభినందించాడు. సాధ్యమయినంత వరకు యిదే మాదిరి గొలుసును మరొకదానిని తప్పకుండా పంపించు. వెంటనే పంపించాలి సుమా!")

"దీన్ని సంపాదించడానికి నేను చిత్రప్రదర్శన శాలలోకి వెళ్ళాల్సి వచ్చింది. శాన్‌మార్టిన్ గర్భాలయంలో దాని స్థాపకుడైన వైద్రాయి, భార్యతోనూ, పిల్లవాడితోనూ కలసిఉన్నట్లు చిత్రం ఒకటుంది నీకు గుర్తులేదూ? ఆయన భార్యకంఠంలో ఒక గొలుసు కనిపించింది. స్పెయిన్‌లోకల్లా అందమైన అమ్మాయి ఒకతె, లోకంలో కల్లా గొప్ప చక్రవర్తి ♦ ఆమాత్రమే సంపాదించగల, అందమైన గొలుసు కావాలని కోరుతున్నదని ఆకళాకారునితో చెప్పాను. దాన్ని నీకు పంపాను. కాని యీ సంగతి ఆ ప్రభూత్తమునితో చెప్పబోకు.

"వైద్రాయికి మళ్ళీ సుస్తీ చేసింది. 'మళ్ళా' అని ఎందుకన్నానంటే – ఆయన అప్పుడప్పుడు ఆరోగ్యంగానే ఉంటాడనీ మెర మెచ్చులకోసం కొలువులో కొందరు మాట్లాడుతూ ఉంటారు. ఇవ్వాళ సెయింట్ మార్క్ దినోత్సవం కావడంచేత వైద్రాయి, విశ్వవిద్యాలయానికి బయలుదేరాడు. అక్కడీరోజు స్నాతకోత్సవం జరుగుతున్నది. ఇరవైరెండు మందికి పండితులని పట్టాలు బహూక

♦ అనగా స్పెయిన్ ప్రభువు

రించబోతున్నారు. అతడు బండిదగ్గరకు వెళ్ళాడో, లేదో, జబ్బువచ్చింది. మూలుగుతూ యింక ముందుకు ఒక్క అడుగు కూడా వేయలేనన్నాడు. అతడ్ని తిరిగి పడక గది లోకి తీసుకొని పోయారు. అక్కడాతడు సువాసనలు విర జిమ్మే చుట్టఒకటి అంటించి, పెరికోల్ ♦కోసం కబురంపాడు. లాటిన్‌లో అక్కడ స్నాతకోపన్యాసం సాగుతున్నది. ఇక్కడ యింతలో పెరికోల్ స్పానిష్‌లో మా గురించిన కథనంతా వైస్రాయికి వివరించింది."

డోనామేరియా యింకా వ్రాసింది. దానికి ఆమె కుమార్తె యిలా వ్రాసింది. "ఉత్తరాలు వ్రాసేటప్పుడు యిలాటి విషయాల్లో జాగ్రత్తగా ఉండాలని, ఎన్నిసార్లు నీకు చెప్పాలి? దోవలోనే ఎవరో తెరచి చదువుతున్న గుర్తులు కన్పిస్తున్నాయి. ఆ విషయంగురించి - అదే— అదే-కుజ్కో దగ్గర నే చెప్పినది. దాన్ని గురించి నీవ్యాఖ్యా నాలు ఎవరన్నావింటే, పూర్తిగా అపార్థం చేసుకుంటారు. నీ వ్రాతలను మెచ్చుకుంటున్నట్లు * విన్‌సెంట్ వ్రాసినా అటువంటి విషయాలు మనల్ని చిక్కుల్లో యిరికిస్తాయి. ఇలాంటి అవక తవక పనులు చెయ్యకపోతే, నిక్షేపంగా గ్రామానికిపోయి పొలంపనులు చూచుకోరాదూ?

"లీమాలో తాలింఖానావద్ద పెద్ద హడావుడిజరిగింది. ఇద్దరు స్త్రీలు బాల్కనీలోంచి క్రిందకు పడిపోయారు.

---

♦ ఒక నటీమణి

* తన భర్త.

కాని దైవవశాన వారు డోనామొర్సెడ్ మీద పడ్డారు. ముగ్గురికీ బలంగా గాయాలు తగిలాయి. కాని సంవత్సరం తిరగకుండానే, యితరవిషయాలనుగురించి వారు ఆలోచించే స్థితిలోకి వచ్చారనుకో! కాగా అధ్యక్షుడు దృష్టిమాంద్యం వల్ల - ఈ హడావుడి ఏమిటో అర్థంకాక, అది ప్రేక్షకుల కరతాళ ధ్వనుల శబ్దమని భావించి, కృతజ్ఞతాపూర్వకంగా శిరస్సు వంకిస్తున్నాడు.

"పెరికోల్ విషయం వచ్చింది గనుక చెబుతున్నాను. నేనూ, పెపీటా*, ఈరోజు సాయంత్రం నాటకానికి వెళ్లాలనుకుంటున్నాం. ప్రజల కింకా పెరికోల్ ఆరాధ్య దేవతగానే ఉంది. ఆమె వయస్సు ముదిరిందన్న సత్యంతో వారికి నిమిత్తంలేదు. కాని ఆమె ఉన్న లావణ్యాన్ని, యెంతో పాటుబడి,సాధనచేసి కాపాడుకుంటుందని అంటారు." (ఇక్కడ ఆంగ్ల అనువాదంలో స్పానిష్ మూలంలోగల సౌందర్యాన్ని, స్పానిష్ భాషలోని నుడికారాన్ని తీసుకు రావడం సాధ్యంకాదు. ఆ నటీమణి వయస్సు యిప్పుడు ఇరవై యెనిమిది సంవత్సరాలు. ముదురు పసుపురంగు చలువరాతి కాంతి ఆమె చెక్కిళ్ళపై మెరుస్తూంటుంది. ఆమె వన్నె యింకా చాలావత్సరాలదాకా పోయేది కాదు. ప్రదర్శనానికి కావలసిన హంగు లలా వుంచి, ఆమెచేసేదల్లా రోజూ రెండుసార్లు చల్లటి నీటితో ముఖాన్ని తుడుచుకోవడమే.) "ఆ చిత్రమైనవ్యక్తి.అతడ్ని పియోమామ అంటారు. ఎప్పుడూ ఆమె ప్రక్కనే ఉంటాడు. అతడామెకు తండ్రో-

* సేవచేసే బాలిక.

కొడుకో, ప్రియుడో చెప్పడం కష్టమంటాడు డాన్ రూచిరో. పెరికోల్ అత్యద్భుతమైన ప్రదర్శనం యిచ్చింది. ప్రాంతీయతత్వం అంటున్నానని నన్ను తిట్టి పారేసినాసరే, అటువంటి కళామూర్తి స్పెయిన్ మొత్తం మీద లేదన్న మాట నిజం"-అలా గేనడిచింది తక్కినఉత్తరం. ప్రదర్శనశాలను సందర్శించడం మీద తరువాతి విషయం ఆధారపడివుంది. మొరెటో రచించిన ట్రంపాఅర్లాంటిలో "డోనాలిమెనార్" గా పెరికోల్ నటిస్తూంది. తనకుమార్తెకు మరో ఉత్తరం వ్రాయడానికి కావల్సిన సాధనసామాగ్రి సంపాదించవచ్చుననే ఉద్దేశంతో డోనా మేరియా ఈప్రదర్శనానికి బయలుదేరింది... ఆమెతో బాటు పెపీటానుగూడా తీసుకుపోయింది. ఈ పిల్లను గురించి ముందు ముందు మనం చాలా తెలుసుకుంటాం...'శాంటా మేరియారోసా డిలాస్ రోసాస్ కాన్వెంటు' కు సంబంధించిన ఒక అనాధ శరణాలయంలో యీ పిల్ల వుండేది. అక్కడనుంచి తెచ్చి తనకు తోడునీడగా వుంటుందని ఆమెను డోనామేరియా తన యింట్లోనే వుంచుకుంటూన్నది. ముందుగల బాక్సులో మార్క్వేస్సా కూర్చొని మిరిమిట్లుగొలిపే రంగస్థలాన్ని దిగ్భ్రాంతురాలై చూస్తున్నది...అంకానికీ -అంకానికీమధ్య తెరముందుకు వచ్చి కొన్నిపాటలు పాడి పోతూండడం పెరికోల్ అలవాటు...మార్క్వేస్సా ఆ ప్రదర్శనానికి వచ్చిన విషయం గమనించి అసూయపడిన పెరికోల్ - రంగస్థలం మీదకు వచ్చి అప్పటికప్పుడు ఆశువుగా ఏవో పాటలు పాడ టం మొదలు పెట్టింది. ఆ పాటలు డోనామేరియాను కించ

పరచాలనే అభిప్రాయంతో పెరికోల్ పాడింది... ఆపాటల్లో డోనామేరియా యొక్క త్యాగమోతుతనం - వెర్రితనం ఆఖరుకి ఆమె కన్నబిడ్డ ఆమెనుంచి విరగడైపోవడానికి దూరదేశం పోయిన విషయం వివరంగా వర్ణించబడ్డాయి. ఈ పాటలు విన్న ప్రేక్షకుల దృక్కులన్నీ డోనామేరియాపై ప్రసరించాయి. గుసగుసలు, వేళాకోళాలు ప్రారంభ మయ్యాయి... కాని మార్క్వెస్సా యీ విషయాన్ని గమ నించనే లేదు. ప్రదర్శనంలోని మొదటి రెండు దృశ్యాలు ఆమె హృదయాన్ని కదలించాయి. రంగస్థలం మీదికివచ్చి పాడుతూన్న పెరికోల్‌ను ఆమె చూడనేలేదు... అప్పటికే ఆమె స్పెయినులోని తన బిడ్డను గురించి భావనా సముద్ర ములో మునిగిపోయింది. పెరికోల్ ఇంకా విజృంభించి దూషణపూరితమైన పాటలు పాడుతున్నది. ప్రేక్షకులంతా వేళాకోళంగా ఘొల్లుమన్నారు... ఈ దైన్య పరిస్థితిని గమ నించిన పెపీటా మార్క్వెస్సా భుజం తిప్పి యింటికి తీసుకు పోయింది. వారు ప్రదర్శనశాలను వదలి పోగానే ప్రేక్షకుల వ్యంగ్యపూరిత వికటాట్టహాస ధ్వనులు - ప్రదర్శనశాలలో ప్రతిధ్వనించాయి... ప్రదర్శనశాల నిర్వాహకుడు పెరికోల్ సాధించిన యీ విజయానికి ప్రతిఫలంగా ఆమె జీతాన్ని పెంచాడు... ఇది తెలిసికొన్న పెరికోల్ వెర్రి ఆవేశంతో గంతులు వేసింది. కాని అక్కడ జరిగిన విషయమేమీ మార్క్వెస్సాకు తెలియదు ... నిజానికి ఆ ప్రదర్శనానికి రావడంవల్ల తన కుమార్తెకు రాయబోయే ఉత్తరానికి మెరుగులు దిద్దవలసిన సరళమైన సమాసాలు కొన్ని దొరికి

నందుకు ఆమె సంతోషించినది. ఆఉత్తరాన్ని చూసి డోనా క్లేరా "మా అమ్మ నిజంగా మెచ్చుకైనవ్యక్తి" అని అనుకోవచ్చును.

తన కొలువుకు సంబంధించిన ఒకానొక గౌరవనీయమైన వ్యక్తి బహిరంగంగా ప్రదర్శన శాలలో అవమానించబడిందనే విషయం నెమ్మదిగా వైస్‌రాయ్ చెవిలోపడింది. అతడు తక్షణం పెరికోల్‌ను తన సమక్షంలో హాజరు పెట్టించాడు. ఆమెను మర్క్వెస్సా దగ్గరకుపోయి క్షమార్పణ కోరితీరాలని ఆదేశించాడు. నల్లటి దుస్తులతో, పాదరక్షలు లేకుండానే మార్క్వెస్సా దగ్గరకు పెరికోల్ వెళ్ళాలని మరీ చెప్పాడు. పెరికోల్ వైస్‌రాయితో వాదించింది — పోట్లాడింది. కాని దాని ఫలితంగా ఒక చెప్పులజత మాత్రమే లభించింది.

ఈ విషయంలో వైస్‌రాయ్ యింతగా పట్టు పట్టడానికి మూడు కారణాలున్నాయి. మొట్టమొదటి విషయం: పెరికోల్ తన కొలువును కించపరిచింది. వైస్‌రాయ్‌కి మొదట్నుంచి తన హోదాకు సంబంధించిన స్వల్పమైన విషయాలుకూడా ప్రాణప్రదంగా చూసుకోవడం అలవాటయింది. అందుచేత మార్క్వెస్సాకు జరిగిన అవమానం తనకు జరిగినట్లుగానే భావించాడు. రెండవది: డోనా మేరియా అల్లుని గౌరవప్రపత్తులు స్పెయిన్‌లో నానాటికి వర్థమానమవుతున్నాయి. ఈ విషయంలో తాను నిర్లిప్తతగా వుండటం తనకు ముందు ముందు ప్రమాదమని వైస్‌రాయ్ భావించాడు. మూడవది: యీ మహానటియొక్క గర్వం కొంతవర

కైనా అణచవలసిన అవసరం వైస్‌రాయ్‌కి కన్పించింది. అంతేగాక ఈమె వేరొక నటునితో చరిస్తూ తన్ను మోసం చేస్తున్నదని అతడు అనుమానించాడు. జరుగుతున్న విష యాన్ని అతను పూర్తిగా తెలుసుకోలేక పోయినా ఏదో జరుగుతున్నదని మాత్రం అతడు పసిగట్ట గల్గాడు. ఇప్పు డిప్పుడే తనని పెరికోల్ అశ్రద్ధచేస్తున్నదని అతనికి స్పష్టంగా తెలిసివస్తోంది.

మార్క్వెస్సా పెరికోల్ రాకకు సిద్ధంగా లేదు... తన కుమార్తె నిష్క్రమించిన తరువాత – డోనామేరియా తన బాధను మరచిపోవడానికి త్రాగుడుకు అలవాటయింది. పెరూలో ప్రతిఒక్కరూ చీచా త్రాగుతారు... పండగ రోజుల్లో తప్పతాగి–మైమరచి పడివుండడం వారు అవమాన కరమైన విషయంగా భావించరు. మానసిక సంక్షోభంతో రాత్రిళ్ళు ఆమెకు నిద్దుర పట్టేదికాదు... పడుకోబోయే ముందు ఒక గ్లాసు చీచా తీసుకొనేది... మైమరచి నిద్రిం చేది... ఆ యవస్థలోనే ఆమె ఆనందానుభూతులను చూర గొనేది... తనకి తన పరిస్థితి బాగుండలేదని – అధఃపాతాళం లోకి కృంగిపోతున్నానని పెపీటాకు పదేపదే చెప్పేది. ఆమె లేఖలను స్పెయినుకు తీసుకొనిపోయే పడవలు నెలకు ఒక సారి బయలు దేరుతాయి; పడవ బయలుదేరేముందు ఒక వారం రోజులుపాటు ఆమె దీక్ష వహిస్తుంది.... కుమార్తెకు పంపవలసిన బహుమతులను సేకరించడంలో ఆమెకు క్షణం తీరిక వుండదు... చివరిరోజు వచ్చేసరికి ఆమె లేఖ పూర్తి చేసి బహుమతులను బంగీకట్టి పెపీటాకు వప్పజెప్పేది. పెపీటా

దానిని బట్వాడాకు అందజేసేది... ఆ మర్నాడు సూర్యోదయ మయ్యేసరికి ఆమెగది తలుపులన్నీ మూతబడిపోయేవి. మళ్ళీ ఆమె కొన్ని వారాలపాటు విపరీతంగా త్రాగుతూ జ్ఞాపకాల బరువులను మరచిపోయి పడివుండేది.... చివరికి మళ్ళీ ఆమె స్పృహలోకి వచ్చి తరువాతి లేఖను వ్రాయడానికి తగిన ఉల్లాసాన్ని సంతరించుకొనేది.

ఆ విధంగా ప్రదర్శనశాలలో అవమానింప బడిన రాత్రి ఆమె తన ఇరవయి రెండలేఖను పూర్తిచేసింది... ఆ మర్నాడు పెపీటా గదిచుట్టూ తిరుగాడింది. డోనామేరియా ముఖకవళికలను గమనించాలని ఆమె ఉత్కంఠ. ఆ మధ్యాహ్నం అల్లికపనికి కావలసిన సాధనసామాగ్రిని తెచ్చి డోనామేరియా గదిలో వుంచింది పెపీటా. మార్క్వేసా కళ్ళు తెరచి శూన్యంగా పైకి చూస్తూ తనలో తాను ఏదో గొణుక్కోవడం మొదలుపెట్టింది... సాయం సమయానికి మార్క్వేసాను చూడటానికి పెరికోల్ వచ్చిందన్నవార్త పెపీటా చెవినపడ్డది... ప్రదర్శనశాలలో జరిగిన నాటి సంఘటన ఒక్కసారి స్ఫురణకువచ్చి... తన యజమానురాలు యిప్పుడెవరినీ జూడ దలచుకోలేదని—వీధివాకిట్లో నిలుచున్న పెరికోల్‌కు కబురుచేసింది. కానిపెరికోల్ వైస్‌రాయ్ ఫర్మానాను తీసుకొని వచ్చింది. ఈ సంగతి తెలిసికొన్న పెపీటా—మార్క్వేసా గదిలోకిపోయి ఆమెను పలకరించడానికి ప్రయత్నించింది. దిగ్భ్రాంతి చెందిన ఆమె చూపులు పెపీటావైపు ప్రసరించాయి. కాని ఆమెలో చైతన్యం కల్గలేదు. పెపీటా ఆమెను కొంచెం తట్టింది... అతి ప్రయత్నంమీద పెపీటా

చెప్పిన మాటల్ని ఆమె వినగల్గింది... రెండుమూడు సార్లు ప్రక్కమీద వాలిపోయింది. పెపీటా చెప్పేమాటల అర్థాన్ని ఆమె గ్రహించలేక పోతున్నది. కాని ఒకనాటిరాత్రి జోరున కురుస్తున్న వానలో చెల్లాచెదరై పోయిన సైన్యాలను సమీకరించుకొంటున్న సైన్యాధిపతిలా ఆమె తన స్మృతిపథంలోని కాంతి పుంజాలను పుంజుకుంటానికి ప్రయత్నించింది. అకారణంగా ఆమెకు శిరోవేదన ఎక్కువైంది... మంచుగడ్డ తీసుకొని రమ్మని పెపీటాను ఆదేశించింది... తేగానే - మంచును గట్టిగా కణతలకు అదుముకొన్నది... ఆ పిమ్మట లేచినిలబడి మంచాన్ని ఆనుకొని నిర్జీవంగా తన పాదరక్షలవైపు జూడసాగింది. చివరకు నిశ్చయపూర్వకంగా ఆమె తలయెత్తి చూసింది... దుస్తులు తెమ్మని ఆజ్ఞాపించింది... అవి ధరించి భారంగా ముందుగదిలోకి నడిచింది... అక్కడే పెరికోల్ ఆమె రాకకై నిరీక్షిస్తున్నది.

అశ్రద్ధగా, అయిష్టంగా, మొండిగా క్షమార్పణ చెప్పి పోదామని పెరికోల్ మొదట భావించింది. కాని ఈ వృద్ధురాలిలో మూర్తీభవించిన హుందాతనాన్ని జూచి ఆశ్చర్యచకితురాలైంది. కొన్ని సమయాల్లో ఈ బట్టల వర్తకుని కుమార్తెలో మాంటెమేయు వంశీయుల గౌరవ మర్యాదలు నిండిన హుందాతనం ఉట్టిపడుతోంది. ఆమె మైకంలో నున్నప్పుడు (Hecuba) హెక్యూబా యొక్క ప్రాభవమంతా ఆమెలో కన్పిస్తుంది.... ఆమె అర్ధనిమీలిత నేత్రాలలో అధికారం తొంగిజూస్తున్నదని భావించిన పెరికోల్ భయంతో కంపిస్తూ "మీరు నిన్న నా ప్రదర్శనాన్ని దర్శించే భాగ్యం

నాకు లభించినప్పుడు—నా ప్రవర్తనను మీరు అపార్థం చేసుకున్నారేమో!" అంది...

"అపార్థమా? అపార్థమా?" అంది మార్క్వెస్సా.

"తమను అవమానం చెయ్యడానికి నేను ప్రయత్నించానని తమరూ అపార్థం చేసికోవచ్చు"

"నాకా!"

"మీ పాదసేవకురాలిపై తమరు ఆగ్రహించారా? ఉద్దేశపూర్వకంగా నే నేపనీ చేయలేదు."

"నాకు ఆగ్రహమెందుకు వస్తుంది! అసలు నాకేమీ గుర్తులేదు. నువ్వు చక్కని ప్రదర్శనాన్ని యిచ్చావన్న విషయం ఒక్కటే నాకు గుర్తువుంది... నువ్వు గొప్ప కళామూర్తివి ... సుఖంగా పది కాలాలపాటు వర్ధిల్లు... వర్ధిల్లు... పెపీటా నా చేతి రుమాలేదీ?"

అస్పష్టంగా తొందరపాటుతో మార్క్వెస్సా అన్న మాటలు విని పెరికోల్ తలక్రిందులై లజ్జాభారంతో క్రుంగిపోయింది. చివరకు అస్పష్టంగా "అంకానికీ అంకానికీ మధ్య నేను పాడిన పాటల్లో... నాకు భయం వేస్తోంది..."

"ఆఁ ఆఁ ... అవునవును... ...నాకిప్పుడే గుర్తుకు వస్తోంది. నేను కొంచెం ముందుగా వచ్చేసినట్లున్నాను... అంతేకదూ, పెపీటా! కాని ప్రదర్శనం మధ్యలోనే లేచి వచ్చినందుకు క్షమించు. అవును అత్యద్భుతమైన నీ ప్రదర్శనం పూర్తికాకుండానే - నేను లేచివచ్చాను... ...

అలా ఎందుకు వచ్చేశానో నా కిప్పటికు గుర్తు లేదు. పెపీటా- ఆ... ఆ... ఏదో జరిగింది."

ఆనాటి ప్రదర్శనశాలలో పెరికోల్ పాడిన పాటలను వినని వారొక్కరుకూడా లేరు. అంతర్గతమై యున్న వ్యంగ్యాన్ని కూడా ప్రతి ఒక్కరూ గ్రహించారు.... కాని యీవిషయాన్ని మాన్యేల్ గ్రహించకపోవడం పెరికోల్ నమ్మలేకుండా వుంది. తన వెర్రి సూరుండాతనాన్ని కాపాడు కోవడానికి బహుశః ఆమె అలా నడిపిస్తూన్నదని పెరికోల్ భావించింది. కాని ఆమె అశ్రుమలినమైన వదనంతో "మీరు చాలా మంచివారు. చిలిపితనంగా నేను చేసే తప్పిదాన్ని మీరు క్షమించారు. మీ మంచితనం నాకింతకు ముందు తెలియదు. మీచేతి నొసారి ముద్దాడనీయండి."

డోనా మేరియా ఆశ్చర్యంతో చేయిజాచింది. చాలా కాలంగా ఆమెనంత ఆత్మీయంగా పలుకరించినవారు లేరు. ఇరుగు పొరుగు వాళ్ళు, స్నేహితులు, నౌకర్లు, ఆఖరుకి పెపీటాకూడా తనకింత సన్నిహితంగా మాట్లాడ లేదు. ఆమె హృదయం ఆర్ద్రమైపోయి "కోపమా! కోపించడమా! నీ మీదనా తల్లీ ... సుగుణాల రాశివమ్మా నీవు ... ... నే నెవరి నమ్మా నీమీద ఆగ్రహం జూపడానికి? నేను వివేక హీనురాలిని. ఎవరి ప్రేమకూ నోచుకోని అభాగ్యురాలను. నాతల్లీ! మబ్బుల చాటున మాట్లాడు కొంటున్న దేవతల సంభాషణ వింటున్నట్లున్నది. నీ గొంతులో ఏదో అద్భుత శక్తి వున్నదమ్మా! మొదటిరోజు చివరిలో నీవు జూపిన భంగిమ యెటువంటిది? చేతులిలా పెట్టావు. మేరీకన్య 'నాకు

బిడ్డడు కల్గడ మెలా సాధ్యం?' అని గేబ్రియల్‌ను అదే భంగిమలో అడిగివుంటుంది. అవును... మొదటి అంకములో డాన్‌వాన్‌ను నువ్వు క్షమించిన దృశ్యానికి అదే తగిన భంగిమ తల్లీ. ఇదే దృశ్యాన్ని నా కూతురు నిర్వహించినప్పుడు చూడాలని నాఅభిలాష. నాబిడ్డ చాలా అందగత్తె. ప్రతివారు ఆమెను అలాగే అంటారు. నా డోనాక్లేరాను నువ్వు ఎప్పుడేనా చూశావా?"

"తమరు మా ప్రదర్శనశాలకు అనేకసార్లు వచ్చారు. అమ్మాయి నాకు బాగా గుర్తు."

"అలా ఒంటికాలుమీద మోకరిల్లి ఎంతసేపని నిలబడతావమ్మా!... పెపీటా - తక్షణం ఈ అమ్మాయికి మిఠాయి తెచ్చిపెట్టమని జనారితో చెప్పు ... ఆలోచించు. ఒకరోజున నేను పడిపోయాను ... ఎందుకో గుర్తులేదు. అయినా ఇందులో ఆశ్చర్యమేముంది? మా మాతృ హృదయాలు క్షణక్షణం... ... ...

"చూడమ్మా! నువ్వు నాకు కొంచెం దగ్గరిగారావూ! మా అమ్మాయి నావిషయంలో చాలా క్రూరంగా వుంటుందని ఊళ్ళో అందరూ చెప్పుకుంటున్నారు. ఆమాటలు నువ్వు నమ్మబోకమ్మా! నీ జీవితం చాలా గొప్పది. నీ హృదయంకూడా. లోకం చూసినట్లుగాక ఉదారంగా నువ్వీ విషయాన్ని చూడగలవు.

"నీతో మాట్లాడటం నాకు ముచ్చటగావుంది. నీ కేశాలు ఎంత అందంగా వున్నాయి! సొగసు తొణికిసలాడు

తున్నది... ...మా అమ్మాయి దుడుకు మనిషి కాదు. ఆ విషయం నాకు బాగా తెలుసు తల్లీ! ఆమె ఎంత తెలివైంది! ఎంత అద్భుతమైంది...! మామధ్య చెలరేగిన అపార్థాలకు బాధ్యత అంతా నాదే.......తప్పుఅంతా నాదే. ఆమె అంతతొందరగా నన్ను క్షమించటం ఆశ్చర్యంకదూ! ఒకరోజున ఇలాంటిదే ఒక చిన్న సంఘటన జరిగింది. ఆరోజు ఇద్దరం పోట్లాడుకొని ఎవరిగదుల్లోకి వారు వెళ్ళిపోయాం. కాని వెంటనే ఒకరినొకరు క్షమాపణ లర్థించుకోవాలని వెనక్కు తిరిగాం. చివరికి మా యిద్దరిమధ్యా వొక ద్వారబంధం వుండిపోయింది. కాని చివరికామె...నా ముఖాన్ని...ఆమె తెల్లటి రెండు చేతుల్లోకి ... ఇలాగే జరిగింది."

మాక్స్వెల్ ముందుకు వంగి క్రిందకు పడ్డానికి సిద్ధమయింది. వెర్రి ఆనందంకరిగి ఆమెకన్నుల్లోంచి జారుతున్నది. ఆమె మళ్ళీ ప్రారంభించింది—

"నువ్వు వచ్చినందుకు చాలా సంతోషం. నా బిడ్డకేమీ అన్యాయం చేయలేదని నా నోటివెంటే నువ్వు విన్నావు. కాని ప్రజలు మరోలా చెప్పుకుంటారు. నిజం చెబుతున్నా విను– నా కేసీ కూడు. తప్పంతా నాది. అలాంటి బంగారపు బొమ్మను కనటం నాతప్పు కాదూ! నా జీవితం అసాధ్యమై పోయింది. నేను ప్రయత్నిస్తున్నాను. నువ్వూ– ఆమె చాలా గొప్పస్త్రీలు — నా మాటకు అడ్డంరాకు. మీరు అసాధారణమైన స్త్రీమూర్తులు – నేనో! వివేక

హీనురాలను. నికృష్ట జీవితం నాది. నీపాదాల నొక్కసారి ముద్దాడనీ నా జీవితం అసాధ్యమైపోయింది... అసాధ్యమై పోయింది. అప్పుడమ్మా నా జీవితం అసాధ్యమై పోయింది"

ఈమాట చెప్పేసరికి మార్కోవ్‌స్నా క్రిందకు ఒరిగి పోయింది. పెపీటా ఆమెను లేవనెత్తి తిరిగి ప్రక్కమీద పడుకోబెట్టింది. విచిత్ర విషాద భావనా ముద్రలో మునిగి పోయి పెరికోల్ గృహోన్ముఖురాలైంది. అలాగే యెంతో సేపు దిగ్భ్రాంతురాలై అద్దంముందు కుప్పలా కూలబడి పోయింది.

కాని మార్కోవ్‌స్నా విషాదభరిత జీవితంలో అతి నికృష్ట ఘట్టాలను చవిజూచిన స్నేహితురాలు పెపీటా. పెపీటా ఒక అనాథ బాలిక. లీమాలో క్రైస్తవ మఠాధ్యక్షురాలైన మాడ్రిమేరియా డల్బిలార్ అనే మేధావంతురాలు యీ అనాథబాలికను పెంచి పెద్దచేసింది. డోనామేరియా ఒకరోజున 'శాంటామేరియా రోసాడిలాస్ రోసాస్ కాన్వెంటు' నిర్వాహకురాలుని కలుసుకొని తనకు సహచరురాలిగా నుండటానికి ఒక అనాథబాలిక కావాలని అన్నది. మొదట తటపటాయించినా, చివరకు డోనామేరియాతో పెపీటాను పంపటానికి అంగీకరించింది ఆ మఠాధ్యక్షురాలు.

స్త్రీకి కూడా సంఘంలో కొంత గౌరవం యివ్వాలని నాగరిక ప్రపంచం గుర్తించడానికి కొన్ని శతాబ్దాలకు పూర్వమే, ఆ విషయాన్ని గురించి కలలు గన్న స్త్రీ ఆ మఠాధ్యక్షురాలు. దైసందిన కార్యకలాపాలంతా పూర్తి

చేసుకున్నాక, అర్ధరాత్రి సమయంలో - స్త్రీ తన వ్యక్తి త్వాన్ని నిలుపుకుని, తనను తాను కాపాడు కొనగల కాలాన్ని గురించి ఊహించుకుంటూ, కలలుగంటూ ఆమె నిద్రపోయేది. దాసీలకూ బీదస్త్రీలకు వృద్ధాప్యంలో స్త్రీలే రక్షణ కల్పించాలని ఆమె ఆశయం. పోటోసీ గనుల్లోనూ, ఇంకా అనేక కొట్లల్లోనూ ఎందరో స్త్రీలు కష్టపడి పని చేస్తున్నారు. వారందరికీ కూడా వృద్ధాప్యంలోనూ, ఆరోగ్యం చెడినప్పుడూ రక్షణ కల్పించాలి. ఆమె వాననక, ఎండనక వీధుల్లోకి విసరి వేయబడ్డ అనాధ బాలికలకు ఆశ్రయమిచ్చేది.

పెరూలోని స్త్రీలంతా, ఆఖరుకు తన మఠంలోని సన్యాసినులుగూడా చాలా చిత్రమైన అభిప్రాయాలు కలిగి ఉంటారు. ఏ పురుషుడినీ ఆకర్షించే శక్తి తమదగ్గర లేకపోవడం వల్ల, తమ జీవితమంతా నికృష్టంగా తయారైందని వారి భావన. ఈ తప్పిదం అసలు మానవస్వభావంలోనే ఉందని ఆమె తెలుసుకుంది. తనవంటి స్త్రీలు ఇరవైమంది కలసినా ఆ రోజుల్లో ఏ ప్రభావమూ కలిగించ గలిగేవారు కాదు. అయినప్పటికీ ఆమె తన కర్తవ్యాన్ని ఎన్నడూ విస్మరించ లేదు. చంద్రబింబంవరకు తన నిర్మాణాన్ని కొన సాగించాలనుకొని ప్రయత్నించే వెర్రివాడిలా ఆమె తన కృషిని కొనసాగిస్తూనే వుంది. అటువంటి వ్యక్తులు ప్రతి కాలంలోనూ పుడుతూనే వుంటారు.

అరుణ కాంతులు చిందులాడే ఆమె ముఖంలో దయారసం తొణికిసలాడు తూంటుంది. ఆమెలో ఆశయాల

కంటే, కార్యశూరత్వమే యెక్కువ. ఆమె విద్యాలయాలు నడిపినా... వైద్యాలయాలు నడిపినా, అనాథ శరణాలయం నిర్వహించినా ప్రతిపనికీ ధనంకావాలి. ఈ ధనాన్ని సేకరించడం కోసం ఆమె తన స్వభావాన్నికూడా మార్చుకోని, కార్యదీక్షతో పనిచేయవలసి వచ్చేది... లీమా ఆర్చిబిషప్ మాత్రం ఆమెను అకారణంగా ద్వేషించేవాడు. ఇతనిని గురించి మున్ముందు కొంచెం మంచి సందర్భాలలో చాలా తెలుసుకుందాం.

చివరకు ఆమె జరాభారంతో కృంగిపోసాగింది. ఏదో విపరీతమైన భయాకులం ఆమెను దహించి వేస్తోంది ... ఆ భయం ఆమెను గురించి కాదు; ఆమె చేయదలుచుకున్న కార్యాన్ని గురించి. ఆమె ఉన్నతంగా భావించిన విషయాలకు విలువ యిచ్చేవారు పెరూలో యింకెవరున్నారు ?

ఒకరోజు ఉదయం ఆమె ప్రక్కమీదనుంచి చివాలునలేచి, అనాథ శరణాలయం, వైద్య విద్యాలయాలు అన్నీ చుట్టివచ్చింది. తాను ప్రారంభించిన కార్యాన్ని తన తదనంతరం, సమర్థతతో నిర్వహించగల వారసురాలిని తాను యిప్పుడు ఎన్నుకోవాలి. అనేకమందిని జూసింది. ఒక ముఖంకంటే — వేరొక ముఖం నిర్జీవంగా కన్పించసాగింది. కాని సావిడిలో కుట్టుపనిచేసే అమ్మాయిలను చూసింది. లీమాలోని సెయింట్ రోస్ జీవితంలోని అద్భుత సంఘటనలను కొన్నింటిని వారిలో ఒకపిల్ల అసాధారణ వక్తృత్వాన్ని ప్రదర్శిస్తూ – తోటివారికి చెబుతున్నది. ఆ అమ్మాయే పెపీటా. అంతటితో – యింతవరకూ మతా

ధ్యక్షురాలు సాగిస్తూన్న అన్వేషణ పూర్తి అయింది. జీవితంలో ఔన్నత్యాన్ని సాధించే విద్య అంత సులభమైనది కాదు... కాని ఈవిషయంలో ఆమె దీక్షతో పనిచేసింది.... ఇంట్లో అత్యంత క్లిష్టమైన పనులెన్నో చేయవలసిన భారం పెపీటామీద పడింది. అనతికాలంలోనే శరణాలయ నిర్వాహణలోని సాధక బాధకాలన్నీ ఆమె కవగతమయ్యాయి. మతాధ్యక్షురాలితో కలసి ఆమె ప్రయాణాలు చేసేది. నిజానికి ఆ బాధ్యత ఆమెదికాదు. అయినా చేసేది! మతాధ్యక్షురాలు తన వారసురాలికి అనేక విషయాలు చెప్పేది. మత విషయాలనుగురించి - శరణాలయ నిర్వహణను గురించి — విరాళాల సేకరణగురించి యింకా వివిధ విషయాలనుగురించి ఆమె బోధించేది. జీవితంలో ఒక మహత్తర ధర్మాన్ని సాధించటానికి అవుసరమైన శిక్షణలో ఒక భాగంగా - పెపీటాను, మతాధ్యక్షురాలు డోనామేరియా దగ్గరకు పంపింది. మొదటి రెండురోజులూ పెపీటా లాంఛన ప్రాయంగా మాత్రం - డోనామేరియా దగ్గరకు వచ్చి పోయేది. ఆ తరువాత డోనామేరియా యింటికే తన బస మార్చివేసుకుంది.

పెపీటాకు జీవితంలో ఏవో సుఖానుభూతులు వున్నాయని తెలియదు. ఆమె కటువంటి శిక్షణ యివ్వబడింది. అందుచేత, డోనామేరియా సహచర్యంలో అనుభవించాల్సిన ఒడుదుడుకులకు ఆ పధ్నాలుగేండ్ల బాలిక - తల్లక్రిందులు కాలేదు.

డోనామేరియా పరిస్థితిని అవకాశంగా తీసుకొని నౌకర్లు యథేచ్ఛగా ప్రవర్తించడం ప్రారంభించారు. తమ బంధు మిత్రులకు మేరియా సౌధంలో బసలు యేర్పాటు చేసేవారు. కావలసిన వస్తువులను సావకాశంగా దొంగి లించుకు పోయేవారు. ఈ అన్యాయాలు జరగకుండా పెపీటా అడ్డుపడి పోరాటం సాగించింది. ఫలితంగా నౌకర్లకు ఆమె విరోధి కావలసివచ్చింది. వారామెకు వీలున్నంతవరకు ఇబ్బంది కల్గించటం ప్రారంభించారు. వేళాకోళాలు, వెక్కి రింతలు ఎక్కువయినాయి. వీటికితోడు మరికొన్ని కష్టాలను ఆమె భరించవలసి వచ్చింది. డోనామేరియా ఊళ్ళో తిరగ టానికి బయలుదేరినప్పుడు - ఆమె వెంట పెపీటాకూడా వెళ్ళేది. ఆమె దోవలో చర్చిని చూడగానే ఒక్కదూకుతో అందులోకి గంతువేసేది. మత విశ్వాసం ఆమెలో ఏనాడో అదృశ్యమైపోయింది. ఇప్పుడు మతాన్ని ఒక గారడీగా భావిస్తున్నది. ఆమె చర్చిలోకి పోయి "కొంచెంసేపు వచ్చి నాముందు నిలబడుతల్లీ" అని కుమార్తెను పిలిచేది! మరు క్షణంలో ఆమె పగటి కలల్లో వళ్ళుమరచిపోయేది. ఆ తరువాత చివాలున మరొక ద్వారంగుండా, చర్చిలోంచి బయటకు వెళ్ళిపోయేది. మాద్రిడ్ మేరియా డెల్‌పిలార్ మొదటినుంచీ పెపీటాకు అత్యంత వినయ విధేయతలతో మెలడగం నేర్పింది. ఆ కారణంగా తన యజమానురాలి కోసం గంటల తరబడి అలా నిరీక్షించి చివరకు ధైర్యంచేసి చర్చిలోకి వెళ్ళి వెదికేది పెపీటా. కాని ఆమెకు అక్కడ మేరియా కన్పించేదికాదు. మళ్ళీ బయటకువచ్చి యజ

మానురాలి రాకకై ఎదురుచూసేది. అలా బహిరంగ స్థలాల్లో - అందులోనూ ఆడపిల్ల గంటలతరబడి నిలబడి ఉండటం ఎంత కష్టమో గ్రహించింది. ఆమె ఇంకా అనాథ శరణాలయ దుస్తులనే ధరిస్తోంది. డోనామేరియా ఆ దుస్తులు వదలి మామూలుదుస్తులు ధరించమని పెపీటాను ఎన్నడూ అడగలేదు. మొగవాళ్ళు తననుచూసి గుసగుస లాడినప్పుడల్లా పెపీటా చాలా బాధపడేది.

కొన్ని క్షణాల్లో డోనామేరియా స్పృహలోకివచ్చి పెపీటాతో మనసువిప్పి మాట్లాడుతుంది. కాని తెల్లవారే సరికి ఆమె ముడుచుకుపోతుంది. ఆమె ఎన్నడూ దుడుకుగా గానీ, ఆగ్రహంగాగానీ ఉండేదికాదు. నిర్జీవమైన పాషాణంలా చైతన్యరహితంగా వుండేది.

ఈ వైఖరి పెపీటాకు చాలా భారంగా ఉండేది. కాని ఆమె గత్యంతరం లేక తన కర్తవ్యాన్నిమాత్రం నిర్వహించి పిల్లిలా నడచి వెళ్ళిపోయేది. తనకు తల్లి దండ్రియైన మాద్రి మేరియా డెల్‌పిలార్ - తనను పంపించినందులకు తాను చేయవలసింది చేయకతప్పదు.

చివరకు ఒక క్రొత్త యదార్థం బయటపడింది. దీని ప్రభావం అటు మార్క్వెస్సామీదనూ, యిటు పెపీటా మీదనూ బాగా ప్రసరించింది. ఆలేఖ డోనాక్లేరా వ్రాసింది.

"అమ్మా - ఈ వాతావరణం చాలా అలసట కల్గి స్తున్నది. పండ్లతోటలూ, పూలతోటలూ బాగా వికాసం చెంది నన్నింకా బాధపెడుతున్నాయి. వాసనలేని పుష్పాలను మాత్రమే నేను సహించకల్గుతున్నాను. అందుకని యిప్పుడు

నీకు సుదీర్ఘమైన లేఖ వ్రాయడంలేదు. ఆయనగనుక పోస్టు వెళ్ళే లోపల వస్తే నీ కెంతో ఆనందం కల్గించేట్లు, నా గురించిన వివరాలన్నీ వ్రాస్తారు. నాకు అక్టోబరు మొదటి వారంలో పాప పుట్టుతాడు గనుక యీ లోగా గ్రిగాన్ వెళ్ళదల్చుకోలేదు." పాపయేమిటి? మార్క్వెస్సా గోడకు జారగిలబడింది. ఈ వార్త తన తల్లి హృదయంలో విపరీతమైన చలనం కల్గిస్తుందని క్లేరా ముందుగానే ఊహించింది. అందుచేత తానీ వార్తను, అతి నిర్లిప్తంగా మాటవరసకు వ్రాసినట్లుగా వ్రాసింది. కానీ క్లేరాప్రయత్నం ఫలించలేదు. దానికి జవాబుగా డోనామేరియా మరొక ప్రసిద్ధమైన లేఖను వ్రాసింది.

ఇన్నాళ్ళకు మార్క్వెస్సాకు జీవితంలో ఆసక్తి కల్గించే విషయం ఒకటి దొరికింది. తన బిడ్డ తల్లి కాబోతూన్నది. డోనాక్లేరాకు తలనొప్పిగా పరిణమించిన యీ సంఘటన డోనామేరియాను పూర్తిగా కదిలించివేసింది. ఆమెలో నూతనోద్రేకాలు, భావాలు విజృంభించాయి. అనతికాలం లోనే వైద్య విజ్ఞానాన్ని అఖండంగా ఆమె సంపాదించింది. నగరమంతా తిరిగి, వృద్ధ స్త్రీలను కలుసుకొని, గర్భం ధరించినప్పుడు, ప్రసవించాక స్త్రీ తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి, ఆమె కావల్సిన భోగట్టా సిద్ధంచేసికొన్నది. అమెరికాలోని విజ్ఞానాన్నంతా ఆమె సేకరించి లేఖల ద్వారా బిడ్డకు పంపించేది. తన 'పాప' రక్షణకోసం ఆమె అనేక వ్రతాలూ, క్షుద్రమైన క్రియలూ మొదలుపెట్టింది. ఇంట్లో యెవ్వరినీ ఒక్క ముడియైనా వేయనిచ్చేది కాదు.

దాసీలను తల ముడిపై చికోనిచ్చేది కాదు. మేడ మెట్లమీద గుర్తులు పెట్టి, వాటిమీదనే దాసీలు నడచితీరాలని శాసించింది డోనామేరియా. పొరబాటున యెవ్వరైనా తప్పటడుగు వేస్తే కేకలు పెడుతూ, కన్నీటితోనే వారినియింట్లోంచి తరిమివేసేది. ఇందుకు సంబంధించిన క్రైస్తవ మత సిద్ధాంతాలను కూడా ఆమె చదువసాగింది. దైవపీఠానికి పోయి, కటకటాలను గాఢంగా కౌగలించుకొని మేరీదేవి ప్రతిమను "తల్లీ! నా కన్నతల్లీ! అంతా సవ్యంగా జరుగుతుందా?" అని వెర్రిగా ప్రశ్నించేది.

అలా వెర్రిగా ప్రార్థించి-ప్రార్థించి ఆమె ప్రాణం విసుగు చెంది విరక్తి పొందేది. ప్రకృతిమాత తన మొరాలించడం లేదు. భగవంతుడు నిర్లిప్తంగా ఉండిపోతున్నాడు. మానవుడు విధి నిర్ణయాన్ని ఎలా మార్చగలడు? ఈ ఆలోచనలతో ఒక వీధిమూలలో ఆమె ఒక గోడకు ఆనుకొని నిస్పృహతో వాలిపోయేది. మళ్ళీ యేదో ఆశ ఆమెహృదయంలో చిగురిస్తుంది. తొందరగా అడుగులు వేసికొంటూ యింటికి వెళ్ళిపోతుంది. చివరకు ఇంతగా ఎదురు చూస్తూన్న ముహూర్త మాసన్న మయింది. శాంతా మేరియా డిక్లుక్సం బాకా దైవ పీఠానికి ఆమె యాత్రకు బయలుదేరింది. ప్రార్థనలో ఏదయినా శక్తి అంటూవుంటే యీ యాత్రవల్ల తప్పకుండా ఫలితం కలగాలి. మూడు మతాల ప్రభావంవల్ల ఆ నేల పవిత్ర మైంది—

ప్రయాణపు కుర్చీలో కూర్చున్న మార్క్వెసాసే లాగే శాన్‌లూయీూన్ రే, వంతెన దాటించ బడింది.

ఆ నగరాన్ని దూరంనుంచి చూసి తొందరగా ప్రార్థనలు చేస్తూ గొణగడం ప్రారంభించింది మార్క్వేస్నా.

అక్కడ జేరాక, బసలో ఒక్క క్షణంగూడా ఆగకుండా, కావల్సిన యేర్పాట్లు చేయవలసిన భారం పెపీటాకు అప్పగించి, మార్క్వేస్నా తొందర తొందరగా చర్చికి పరుగెత్తి సాగింది. అక్కడ మోకరిల్లి ఎంతోసేపు ప్రార్థనలు చేసింది. ఆమె అంతరాళాల్లో నూతన ప్రసన్న భావం వెల్లువికింది. తన కమార్తెనూ, ఆమెను కాపాడే దైవతాలనూ, వారి మానాన్ని వారిని వదలివేయడానికి ఆమె సిద్ధమౌతూన్న దేమో! అరుణోదయమైనప్పటినుంచీ, అర్థరాత్రివరకూ, అక్కడే అర్చన ద్రవ్యాల నమ్ముతూ, నిరంతరం డబ్బుగురించి పలవరించే వృద్ధురాలి ప్రవర్తన ఆమెకిప్పుడు కంటక ప్రాయంగా కన్పించ లేదు. ఆ చర్చి సేవకుడు తరచు యేదో వొకనెపంతో తన దగ్గర డబ్బు గుంజటానికి ప్రయత్నాలు చేస్తున్నా, ఆమెకు బాధ కలుగలేదు. ఆమె నెమ్మదిగా బయటకు నడిచి, అక్కడి సరస్సు మెట్లపై కూర్చుంది. ఆ తోటలో తారాడుతూన్న వికలాంగుల కేసి ఒకసారి చూసింది. అప్పుడే ఆకాశంలో ఎగిరి పోతూన్న మూడు డేగలు ఆమెకు కన్పించాయి. సరస్సుదగ్గర ఆడుకుంటూన్న పిల్లలు, ఆమె నొక్కసారి తేరిపారజూచి గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు.

ఒక ఒంటె మాత్రం పొడుగైన మెడను యింకా చాచుకుంటూ డోనామేరియా దగ్గరకు వస్తున్నది. తన చుట్టూ వున్న మనుష్యులపై ఆ ఒంటెకు అంతులేని శ్రద్ధా

సక్తు లున్నాయి. ఒకసారి తానుగూడా మనుష్యుల్లో ఒక రుగా నటిస్తూంటుంది. వారి కష్టాలకూ, బాధలకూ సాను భూతి సూచకంగా ఏదో ధ్వని చేయబోతుంది.

స్పెయిన్‌నుంచి వచ్చిన ఉత్తరాలు తనకు ప్రత్యేక వార్తాహరుని ద్వారా తక్షణం జేరడానికి కావల్సిన యేర్పా ట్లన్నీ డోనామేరియా చేయించింది. ఒక కుర్రవాడు పరు గెత్తు కుంటూ వచ్చి, ఒక బంగీని యిచ్చిపోయాడు. ఆమె నెమ్మదిగా దాన్ని ఊడదీసింది. మొదట తన అల్లుడు ప్రేమ పూర్వకంగా వ్రాసిన ఉత్తరం కనిపించింది. ఆ తరువాత తన బిడ్డ వ్రాసిన ఉత్తరం ఉంది. ఆ ఉత్తరమంతా గాయ పరచే దూషణ భాషణాలతో నిండి ఉంది. అవన్నీ అద్భుత మైన శైలిలో ఉన్నాయి. తల్లిని బాగా బాధ పెట్టడానికే అవి వ్రాయబడ్డాయి. అందులోని ప్రతిఅక్షరాన్నీ వాక్యాన్నీ జాగ్రత్తగా చదివి, క్షమాపూర్వకంగా వాటిని తిరిగి చుట్టి వేసింది. చివరకు ఆమె లేచి సానుభూతి చూపుతూ, యింకా ఎదురుగుండా నుంచున్న ఒంటెను పంపివేసి, లోపలకు వెళ్ళిపోయింది.

మార్క్వెస్సా ఈ విధంగా, ఇక్కడ తిరుగుతున్న సమయంలో పెపీటా బసలో తమ నివాసానికి కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తిచేస్తున్నది. బట్టల పెట్టెలన్నీ చక్కగా సర్దించింది. పూజపెట్టె అంతా విప్పి, సక్రమంగా అమ ర్చింది. డోనాక్లేరా చిత్రాలను కూడా పొందికగా అలంక రించింది. వంట యింట్లోకిపోయి, మార్క్వెస్సాకు యెటు వంటి భోజనం తయారు చేయాలో వివరాలు చెప్పివచ్చింది.

ఆ తరువాత గదిలోకివచ్చి కూర్చుని యజమానురాలికోసం ఎదురు చూస్తున్నది. మఠాధ్యక్షురాలికి ఒకఉత్తరం వ్రాయా లనుకొంది. ఈక కలం కేసి వణుకుతూన్న పెదిమలతో అలాగే చూస్తూ కాస్సేపు తటపటాయించింది. మాడ్రిడిమేరియా డెల్ పిలార్ ముఖం, అద్భుతమైన నల్లటి కళ్ళతో ఎర్రగా కన్పిం చింది. తన జీవితంలో అనేక రోజులు ఆమె చెంతనే గడచి పొయ్యాయి. ఎన్నో విషయాలు తనతో ఆమె చర్చించేది. తనతో ఒక పసికందుగా కాక, సమాన స్థాయిగల వ్యక్తితో మాట్లాడుతున్నట్లు మాట్లాడేది. అలా మాట్లాడటంతో, తాను ఉక్కిరి బిక్కిరై పోయేది. తనకు వయస్సుకు మించిన ఆలోచనలు కలిగించి అలాగే జీవింప చేసింది. సిమెలీపై తన జ్యోతిని ప్రసరింప చేసిన జూపిటర్ వలె మేడ్రిడిమేరియా కూడా, పెపీటాలో తన ప్రతి బింబాన్ని స్పష్టంగా చూసు కొనేది. ఇందుకు తన అర్హతను శంకించి, కుమిలి కుమిలి ఏడ్చేది పెపీటా. ఈ సుదీర్ఘమైన ఒంటరి జీవితం, ఆమెకు శిక్షణగా విధించింది, మఠాధ్యక్షురాలు. ఈపరిస్థితిని అంగీక రించలేక పోతున్నది పెపీటా. ఈ వింత వాతావరణంలో, చిత్రమైన కొండల ఔన్నత్యంలో, ఆమె హృదయంకూడా తేలిక పడుతున్నది. తక్షణం తన జీవితానికి అత్యంత ప్రియ మైన వ్యక్తిని చూడా లనిపించింది. ఆమె ఒక ఉత్తరం వ్రాసింది. అదంతా సిరామరకలతో, అసందర్భవాక్యాలతో నిండిపోయింది. ఆతరువాత ఆమె వంట ఎంతవరకుఅయిందో చూడటానికి క్రిందకు వెళ్ళింది.

మార్కోవ్నా లోపలికి వచ్చి మేజాబల్ల మీద కూర్చొని "నేనింకేమీ చేయలేను, ఏది జరగాలో అదే జరుగుతుంది." అంటూ గొణుక్కుంది. ఆమె మెళ్ళోని తాయెత్తులను తీసి అవతల పారవేసింది. విపరీతంగా ప్రార్థనలు చేసి భగవంతుణ్ని విసిగించి అతనితో విరోధం తెచ్చుకున్నా ననే భావం ఆమెలో కల్గింది. "ఏదీ నా చేతుల్లో లేదు. నేను దేన్నీ మార్చలేను. జరగవలసింది జరుగక మానదు" అని పదే పదే తనలో తాను అనుకుంటున్నది. ఆమె అలా యెంతోసేపు కూర్చొంది. తన అరచేతుల్ని చెక్కిళ్ళకు అదిమిపట్టుకొని తన మనస్సులోని ఆలోచనలన్నింటినీ పారద్రోలి వేయడానికి ప్రయత్నిస్తోంది. ఆమె కళ్ళు అప్రయత్నంగా పెసీటా ఉత్తరంపై పడ్డాయి. ఆమె యాంత్రికంగానే ఆ ఉత్తరాన్ని తెరచి చదువ మొదలు పెట్టింది. సగం చదివాకగానీ అందులోని విషయాలు ఆమెకు అవగాహన కాలేదు.

......కాని నేనిక్కడే వుండాలని మీరు కోరినట్లయితే యీ విషయాలన్నీ నాకు లెఖ్కలోనివి కావు. ఈ సంగతులన్నీ మీకు చెప్పడం ఉచితంగాదు కాని పదే పదే యీ దాసీలు నన్నుపదో ఒక గదిలో బంధించి వారికి కావలసిన వస్తువులను దొంగిలించుకు పోతున్నారు. ఆ వస్తువులన్నీ తస్కరించింది నేనని మాయజమానురాలు భావించవచ్చును. అలా జరుగదనే నే నాశిస్తున్నాను. మీరు కులాసాగానే వున్నారని నా భావన. మిమ్మల్ని చూడలేక పోయినా ఎప్పుడూ మీ గురించే ఆలోచిస్తున్నాను. తల్లీ! మీరు

చెప్పిన విషయాలన్నీ బాగా జ్ఞాపకం వుంచుకున్నాను. మీకు యిష్టమయిన పనులనే నేనుచేస్తాను. మీకు అభ్యంతరం లేకపోతే ఒకసారి మఠానికి వచ్చి వారం రోజులపాటు ఉండిపోవాలని ఉవ్విళ్ళూరుతున్నాను. ఇక్కడ దుర్భరమైన ఒంటరి తనాన్ని అనుభవిస్తున్నాను. ఎవరితోనూ మాట్లాడ లేక పోతున్నాను. కొన్ని సమయాల్లో మీరు నన్ను మరచిపోయారేమో ననిపిస్తుంది. కాని ఒక్కనిముషం తీరుబాటు చేసికొని నాకు ఉత్తరం వ్రాయలేరూ ! దానిని నేను ప్రాణపదంగా జూచుకుంటాను. కాని మీకు ఒక్క క్షణం కూడా తీరిక ఉండదని నాకు తెలుసును.''

డోనామేరియా ఆ తరువాత చదవలేదు. ఉత్తరాన్ని మూసి పక్కగా పెట్టింది. ఒక్క నిముషంపాటు ఆమెమనస్సు అసూయాబాధితమై పోయింది. ఇతరుల హృదయాల మీద యీ మఠాధ్యక్షురాలికి ఎంతటి ప్రభావం వుంది! మరొకరి హృదయంపై తనకుకూడా అంతటి పలుకుబడి కావాలని పించింది. ఇటువంటి నిరాడంబరమైన ప్రేమతో ఆమె జీవించాలని నిశ్చయించుకుంది. ఆడంబరాన్నీ అహంకారాన్ని విసర్జించాలని నిర్ణయించుకుంది. అవే ఆమెను యిన్నాళ్ళూ వెన్నాడుతున్నాయి. ఆమె మనస్సులో చెలరేగిన యీ పరి పరి విధాలైన ఆలోచనలనుండి బైటపడటానికి ఆమె ఒక ఆధ్యాత్మిక గ్రంథాన్ని తీసుకొని చదువడానికి ప్రయత్నించింది. కాని ఆమెకు ఆకస్మికంగా ఇందాకటి ఉత్తరాన్ని మళ్ళీ చదవాలనిపించింది. ఆ జాబులోని అంతర్గతమైన సౌమనస్యాన్ని-సాధ్యమైతే గ్రహించాలని ఆమె భావన.

పెపీటా యింతలో భోజనం తీసుకువచ్చింది. ఆమెతో కూడా మరొకదాసి వచ్చింది... పనికత్తెకు చెప్పవలసిన విషయాలను నెమ్మదిగా చెప్పి - భోజనం సిద్ధమైనదని మార్క్వెస్సాను పిలిచింది పెపీటా... లీమాలో మార్క్వెస్సా భోజనం చేసేటప్పుడు పక్కనకూర్చోవడం పెపీటాకు అలవాటు. అందుచేత మార్క్వెస్సా "అమ్మా! నా సరసన కూర్చొని నువ్వుకూడా భోజనం చెయ్యవూ?" అని అడిగింది.

"నేను క్రిందనే భోజనం చేశానమ్మా" అంది పెపీటా. "నాతో భోజనం చెయ్యడం ఈమెకు యిష్టంలేదేమో! నా నిజ స్వరూపం యీమె తెలుసుకుంది. అందుకనే నేనంటే తిరస్కారభావంచూపెడుతోంది." అనుకుంది మార్క్వెస్సా.

తాను చేసిన తప్పును గ్రహించిన పెపీటా "అమ్మా! మీరు భోజనం చేసేదాకా ఏదయినా చదువమంటారా?" అంది.

"వద్దు... కావాలంటే నువ్వు వెళ్ళి పడుకోవచ్చు"

"వెళ్ళొస్తానమ్మా"

డోనామేరియా లేచి మేజాబల్లను సమీపించింది... ఒకచెయ్యి కుర్చీపై ఆన్చి "నా తల్లీ! రేపు వుదయమే లీమాకు ఉత్తరం పంపిస్తున్నాను. నీ ఉత్తరాన్ని కూడా దీనితో పాటు పంపవచ్చు" అంది.

"నే నెవరికీ ఏమీ వ్రాయలేదు" అంది పెపీటా.

"కాని తల్లీ! మేడ్రిమేగియా డెల్‌పిలార్‌కు నువ్వు ఒక జాబు వ్రాయలేదూ?" పెపీటా యీ [illegible]

నట్లు నటించి కొంచెంసేపు అయ్యాక "నేనా ఉత్తరాన్ని పంపించ దలుచుకోలేదు. నా మనస్సు మార్చుకున్నాను" అంది.

"నీ ఉత్తరంజూచి ఆమె చాలా సంతోషిస్తుంది"

"ఆ విషయం నాకు తెలుసునమ్మా!"

ఈ మాటలకు పెపీటా సిగ్గుపడింది. తాను అలా జాబు వ్రాయడం మంచి విషయం కాదని చెప్పాలనుకుంది. ఈ విషయాన్ని గ్రహించిన డోనా మేరియా "ఎందుకలా బాధపడుతావమ్మా! ఉత్తరం చాలా బాగుంది. నామాట నమ్మ. నాకు బాగా తెలుసు. కాదు...కాదు. ఆ ఉత్తరం నీకు యెందుకు మంచిది కాకపోయింది?"

పెపీటా తత్తరపాటుతో ఏదో ఒక సమాధానం చెప్పి ఆ విషయాన్ని అంతటితో ముగించాలనుకుంది. "ఆ ఉత్తరం ధైర్యాన్ని సూచించదు" అన్నది. ఆపైన ఏమీ చెప్పలేక పోయింది. ఆ ఉత్తరాన్ని తన గదిలోనికి తీసుకుపోయి ముక్కలు ముక్కలుగా చించి పారేశింది. ఆ తరువాత ప్రక్కమీద వాలిపోయి - అంధకార మలినమైన ఆకాశం లోకి చూస్తూ పడుకుంది.

డోనా మేరియాకు మాత్రం కన్నులు మూత పడ లేదు. అలాగే కూర్చుంది. ఆమె హృదయం పరిపరివిధాల స్పందించింది. ఆమె ధరించిన తాయెత్తులూ, జపమాలలు గుర్తుకువచ్చాయి. విపరీతంగా త్రాగి ఒళ్ళు తెలియకుండా పడిపోయిన సంఘటనలు కండ్లముందు మెదిలాయి. తన

కన్న బిడ్డను మరొక్కసారి తలుచుకున్నది. తమ జీవితాల మధ్యగల సుదీర్ఘమైన రక్తబంధం వ్యర్థ వాగ్వివాదాలతో బలహీనమై పోయినది. ఒకానొక రోజున మేజా బల్లమీద తాను కోపంతో బాదడం ఆమెకు గుర్తుకువచ్చింది.

"ఇది నాతప్పుకాదు. నేనలా ప్రవర్తించేదాన్ని కాదు. నా తప్పు యేమాత్రం కాదు. పరిస్థితుల ప్రాబల్యం అలా జేసింది. అటువంటి జీవితం నాకు అలవాటు అయి పోయింది. రేపు నేను సరికొత్తజీవితం ప్రారంభిస్తాను. తల్లీ! ఆ విషయం నువ్వే జూస్తావు." అంటూ కేకలుపెట్టింది మార్క్వెస్సా. మేజాబల్లమీద కూర్చుని ఉత్తరం వ్రాయ మొదలు పెట్టింది. తాను తన బిడ్డను ఎంతగా ప్రేమించిందీ, జాలిగొలిపే ప్రార్థనలతో ఉత్తరాలు వ్రాసిన విషయం జ్ఞాపకంవచ్చి ఆమె హృదయం అవమానంతో కృంగి పోయింది. ఈ లేఖలో ప్రేమనుగురించి డోనామేరియా వ్రాసిన అద్భుతమైన వాక్యాలవల్ల యిది ప్రసిద్ధిలోనికి వచ్చింది. "జీవితంలో మనం అనేకమంది వ్యక్తులను కలుసు కోవడం జరుగుతుంది... ..." అలాగే నడుస్తుంది ఉత్తరం. ఆమె లేఖ పూర్తి చేసేసరికి యించుమించు తెల్లవారింది. ఆమె వరండా తలుపు తెరిచి మిణుకు మిణుకుమంటూ పాలి పోతున్న నక్షత్రాల వరుసలను జూసింది ... ఆతరువాత క్రొవ్వొత్తిని ఆమె ప్రక్కగదిలోనికి తీసుకొనిపోయి అచట పరుండిన పెపీటా ముఖాన్ని పరికించింది. "ఇప్పుడు నన్ను

జీవించనీ...... మళ్ళీ జీవితం ప్రారంభించనీ" అంటూ గొణిగింది.

రెండు రోజులతరువాత వాళ్ళు తిరిగి లీమాకు బయుద్దేరారు. తిరుగుప్రయాణంలో శాన్ లూయిూ రే వంతెనను దాటుతున్నప్పుడే తనకు తెలిసిన ఆ విషాద సంఘటన జరిగింది...... ...

# ఎస్టబాన్

'శాంతా మేరియా రోసా డిలాస్ రోసా' కాన్వెంటు ముందర బుట్టలో ఒకానొకనాడు కవలపిల్లలు దొరికారు. బిడ్డలకు పాలిచ్చే దాది రాకపూర్వమే వారికి నామకరణం జరిగిపోయింది. కానీ మనలో చాలామందికి మల్లే ఆ పేర్లు వారి కంతగా నుపయోగపడలేదు. దానికి కారణం వారిలో ఎవరెవరో గుర్తుపట్టడం అసాధ్యమయిన విషయం. ఈ పృథ్విలో వారిని చేరదీసి రక్షణ యిచ్చినది ఆ కాన్వెంటు నిర్వాహకురాలు — మేడ్రి మేరియా యాంజెల్ పిలార్. ఆమె పురుష ద్వేషి. కాని ఆమెకు మాన్యుయలు - ఎస్టబాన్‌లు ఆత్మీయులయ్యారు. తరచుగా వారిని ఆమె తన గదిలోకి పిలిపించేది. తినుబండారాలు తెప్పించి సెట్టి సిడ్-జూడాస్‌ను గురించీ, మెకాబియస్ గురించీ - మాగ్డెలీన్‌కు ఎదురైన ముప్పైఆరు దురదృష్టాలను గురించీ—రకరకాల కథలు చెబుతూండేది. వారు పెరిగి పెద్దవారయ్యాక - అందరు పురుషులలోనూ కన్పించే వికృత లక్షణాలలో యెలా మారి పోతారో అని పరీక్షగా ఆ కవలల నీలికన్నుల్లోకి చూసేది. కాన్వెంటులో స్త్రీలకు యిబ్బంది కల్గించే వయస్సు వచ్చే వరకూ వారు అక్కడే పెరిగారు. ఆ తరువాత పట్టణంలో గల చర్చిలలోని సామానులు జాగ్రత్తపెట్టే ఉద్యోగం వారికి లభించింది. అందరితో మంచిగా వుంటూ కన్పించిన

శిలువలనన్నింటినీ తుడిచి భద్రపరిచేవారు. రోగగ్రస్థులైన వారిదగ్గరకు మతాచార్యుడు వచ్చేటప్పుడు అతని వెన్నంటి ధూమకలశంతో ఎస్టబాన్‌గాని, మాన్యుయల్‌గాని వెడుతూ వుండేవారు. కాని వారు పెద్దవారవుతున్నకొద్దీ గుమాస్తా జీవితంమీద విరక్తి చెందసాగారు. ఆ దరిమిలాను వ్రాయస గాని వృత్తిని చేపట్టారు. అప్పటికి అమెరికాలో కొద్ది మాత్రమే ముద్రణాలయాలుండేవి. అందుచేత అనతికాలం లోనే పుష్కలంగా వీరికి ధనార్జన లభించింది. వర్తకులకు ప్రకటనలు... ప్రదర్శనశాలలకు నాటకాలూ, పాటలూ, ఎన్నో వారు వ్రాసేవారు.

వారికి సంసారబంధనాలు లేకపోవడం, కవలపిల్లలు కావడం – ఒక స్త్రీచేత పెంచబడటం – ఈ పరిస్థితులవల్ల వారు నిశ్శబ్దంగా ఉండేవారు. వారిలోగల పోలికలను తలచు కొని సిగ్గుతో క్రుంగిపోయేవారు ... తమనుగురించి వేళా కోళంగా మాట్లాడుకుంటూ, వింతగా చెప్పుకుంటూ వుండే ప్రపంచంలో వారు బ్రతకాలి. ఈ పరిస్థితి వారికి సుత రామూ నచ్చలేదు. ఎన్నోరకాల అవమానాలనూ, అప హాస్యాలనూ సహనంతో భరించేవారు. మాటలు నేర్చు కోవడం, ప్రారంభించినదాది వారిరువురి మధ్య ఒకరహస్య భాష ఉద్భవించింది. ఆ భాషకు స్పానిష్‌భాషా సంబంధం లేదు. వారు ఒంటరిగా నున్నప్పుడే ఆ భాషలో మాట్లాడు కొనేవారు. పదిమందిలోకూడా అత్యవసర సమయాల్లో అస్పష్టంగా వారి పెదిమలు స్పందించేవి. లీమా అర్చిబిషప్ శబ్ద ఉత్పత్తి శాస్త్రం తెలిసినవాడు. అతడు ఈ భాషలోని

రహస్యం గ్రహించాలని వ్యర్థప్రయత్నాలెన్నో చేశాడు. ఈ కవలలిరువురిమధ్య ఏదో గుప్తమైన భాష ఉందని తెలుసుకుని అతడొకరోజున వారిరువురికోసం కబురుచేశాడు. ఆ ఆదేశాన్నందుకున్న కవలలు వెళ్ళి విలువైన తివాచీలమీద అతనిముందు నిలబడ్డారు. అతను వారిని సాకల్యంగా పరిశీలించాడు. ఆ కొలదిసేపూ కవలలకు నిప్పులమీద ఉన్నట్లనిపించింది. నెత్తురు కక్కుకున్నట్లు అయింది. అర్చిబిషప్ అడిగిన ప్రశ్నలకు సరిగా సమాధానం యివ్వలేక తడబడసాగారు. తన హోదానూ, భోగభాగ్యాలనూ జూచి భయభ్రాంతులై వారు సమాధానం చెప్పలేకపోతున్నారని భావించాడు, అర్చిబిషప్. చివరకు చేయునది లేక విచారంతో వారిని పంపివేశాడు.

వారిలో ఒకరికి మరొకరికి గల అద్వైతభావానికి ఆ భాష ఒక చిహ్నం. క్లుక్సం బాకాలో ఉన్నప్పుడు మాక్వెసాడి మాంటిమేయర్‌లో వచ్చిన ఆధ్యాత్మికపరివర్తనాన్ని వివరించడానికి నిర్లిప్తత అనే మాట ఎంతఅల్పమైనదో, అలాగే యీకవలల మధ్యగల బంధాన్ని వర్ణించడానికి ప్రేమ అనేమాట అంత అసంపూర్ణమైనది. చివరకు యీ సోదరులు లజ్జాభారంతో క్రుంగిపోయేస్థితికి దిగజారిపోతున్నారు. వారిరువురి మధ్యా సంభాషణ అట్టే సాగేదికాదు. తిండినిగురించీ-దుస్తుల్నిగురించీ ఉద్యోగంగురించీ, సాధ్యమైనంత క్లుప్తంగా వారు మాట్లాడుకొనేవారు. ఇద్దరూ కలసి లోకానికి కనబడటానికి భయపడేవారు. వెళ్ళేది ఒకే చోటునకైనా- తలొకదోవన నడచి గమ్యస్థానాన్ని చేరేవారు. వీరి

స్నేహబంధ మెటువంటిదో వర్ణించడం ఎలాగ! కాని సోదరు లిద్దరూ ఒకరిని విడచి మరొకరు బ్రతికే స్థితిలో మాత్రం లేరు. తనువులు వేరయినా ఆత్మలొక్కటే అనురీతిని ప్రవర్తిల్లారు. వారిద్దరిమధ్యా అద్భుతమైన సంబంధం ఏర్పడింది. వారి మనఃపథాలను ఏదో అసాధారణశక్తి బంధించింది. ఒకరు ఏంచేస్తున్నారో - దూరంగా నాల్గువీధుల కావలి తిరుగుతున్న రెండోవానికి తెలిసిపోయేది.

ఒక్కసారిగా యీ వ్రాయసకాని వృత్తి వారికి విసుగనిపించింది. వ్రాసి వ్రాసి వారు అలసిపోయారు. సముద్ర తీరానికి పోయారు... పడవల్లోని వస్తువులను తీరానికి, తీరం మీది వస్తువులను పడవల్లోకి - చేరవేసే కూలిపని వారికి దొరికింది... ♦ ఇండియన్లతో కలసి అలా పనిచేయడానికి వారికి అంతగా సిగ్గు అనిపించలేదు. కొంతకాలం వారు బళ్ళు తోలారు. కొంతకాలం పళ్ళు కోశారు. మరి కొంత కాలం పడవలు నడిపారు. ఈ కాయకష్టంతో చెంచువాళ్ళలా తయారయారు. వారు కేశాలు కత్తిరించుకొనే వారు కాదు. వారి కళ్ళు ఆశ్చర్యంతో కంపిస్తూ కొంచెం భయంకరంగా ఉండేవి. ఒకరి కొకరుమినహా ఈ లోకమంతా వారిపై విరోధ భావంతో ఉంది. ప్రపంచం వారికి వింతగానూ, దూరంగానూ కనిపిస్తోంది. చివరికి ఈ అద్వైత జీవితబంధాన్ని మాలిన్యంచేయడానికి - వారిపై ఒక నీడ పడింది. ఆ నీడకు ప్రేరణ ఒక స్త్రీ ప్రేమ!

---

♦ అమెరికాలోని ప్రాచీన ప్రజలు—'ఎర్ర ఇండియనులు'

వారు నగరానికి తిరిగివచ్చి ప్రదర్శనశాలలకు కావలసిన విషయాలు వ్రాయడం ప్రారంభించారు. కాని కవలలకు అక్కడకూడా కులాసాగా లేదు. వారు ఒకరితో నొకరు మనసు విప్పి మాట్లాడుకోవడం యింకా అయోమయంగా ఉండేది. నిశ్శబ్దంగా నున్నప్పుడే ఒకరిని గురించి యింకొకరు కొంతైనా గ్రహించ కలిగేవారు. గౌరవ ప్రాభవాలూ, అనురాగాలూ, అభిమానాల్లు, సిరిసంపదలు అన్నీ, వారికి అలసట కలిగించే విషయాలే అయ్యాయి. సాహిత్యంమీద కూడా వారి అభిరుచి అలాగే నీరసంగా వుంది. కాని ఆ ప్రదర్శనశాలలో - కండ్లకు మిరిమిట్లు గొలిపే ఆ దుస్తులనూ, దీపాలను - దిగ్భ్రాంతితో చూస్తూ కూర్చునేవారు. అంకానికి అంకానికీ మధ్య పెరికోల్ వేషం తీసివేసి తెరముందుకు పోయి నాట్య ప్రదర్శనా లిచ్చేది. తానింకా వ్రాయవలసినది కొంత ఉందని చెప్పి - లేదా కనీసం అలా నటించి—ఎస్టెబాన్ ముందుగా యింటికి వెళ్ళిపోయాడు. కాని మాన్యుయేల్ అక్కణ్ణుంచి కదలలేదు. పెరికోల్ ధరించిన ఎర్రటి మేజోళ్ళకేసి, పాదరక్షలకేసి చూస్తూ ఉండిపోయాడు.

సోదరు లిద్దరూ రంగస్థలం వెనుక, మెట్లమీద, తాము వ్రాసిన ప్రతులను పుచ్చుకొని అటూ యిటూ తిరుగుతూండేవారు. అక్కడే అద్దంముందు అలంకరించుకుంటూ, రంగస్థల దర్శకుడు తనకోసం బిగ్గరగా చదువుతున్న సంభాషణలను వింటూ, మధ్య మధ్య చిరచిరలాడుతున్న ఒక పిల్ల వారికి కనిపించేది. ఒక్కొక్కసారి, క్షణం

పాటు ఆమె ఆశ్చర్యంగా ఈ కవలలకేసి చూసి, దిగ్భ్రాంతి చెందుతూండేది. మళ్ళీ ఈ కవలల పోలికలను చూసి నవ్వుకొనేది. ఒకసారి ఆమె ఆ కవల లిద్దరిని ఒక గదిలోకి పిలచి, ఒకరి పక్కన నొకరిని నిలబెట్టి ప్రతి అవయవాన్నీ జాగ్రత్తగా పరీక్షించి, చివరికి సెబ్ స్టిబాన్ భుజంమీద చేయి వేసి 'ఇదిగో! యితడు చిన్నవాడు' అంది.

అప్పటినుంచీ ఆ ప్రదర్శనశాల మాన్యుయేలు జీవితానికి రంగస్థలమైంది... అర్ధరాత్రి సమయాల్లో-ఆమె నిదురించే గది కిటికీకేసి చూస్తూ, చెట్లమధ్య నాతడు తారాడుతూండేవాడు... మాన్యుయేల్ స్త్రీ ఆకర్షణకు లొంగడం యిదే మొదటిసారికాదు. ఇంతకుముందు ఇద్దరూ స్త్రీలను అనుభవించినవారే. కాని అతని హృదయం, ఆలోచన అన్నీ ఇలా స్తంభించిపోవడం యిదే మొదటిసారి. సౌఖ్యం-ప్రేమ ఈ రెండు విడివిడిగా వుంటే జీవితం సుకరంగానే సాగిపోతుంది. కాని ఇప్పుడలా కాదు. అతని సౌఖ్యం అతని ప్రేమమీద నాధారపడి ఉంటుంది. ఇప్పుడాతనికి ప్రపంచమంతటిపై అశ్రద్ధ కలుగుతూంది. అతని ఆలోచనలూ, ఆకాంక్షలూ అన్నీ ప్రేయసిపై కేంద్రీకరించబడ్డాయి. అతడు గాఢంగా ఆమెను ప్రేమిస్తున్నాడు. ఈ విషయం ఆమెకు తెలియడం జరిగితే ఆమె ఆశ్చర్యాని అసహ్యానికీ, అంతముండదు. కథల్లోనూ, కావ్యాల్లోనూ ప్రేమగాథలు చదివి, వాటి ప్రభావంవల్ల ప్రేమలో పడ్డవాడుకాదు. మాన్యుయేల్... ప్రేమనుగురించి వినకపోతే చాలామంది ప్రేమగొడవల్లో పడేవారుకాదు అనేవిషయం - మాన్యు

యేల్‌కు వర్తించదు. మాన్యుయేల్ చదివినదేమీ లేదు. ప్రదర్శనశాలకు కూడా అతనువెళ్ళింది ఒక్కసారి మాత్రమే. అతను విన్న పెరూలియన్ జానపదగీతాలకుమల్లే ప్రేమతో నిండి వుండేవికావు. ఆమె అందగత్తె. శ్రీమంతురాలు. చమత్కారంగా మాట్లాడగలదు. పైగా పైస్రాయి ప్రేయసి. ఈ విషయాలన్నీ తెలిసికూడా మాన్యుయేలు ఆమెను ఆశించాడు. అలాగే చెట్లకు నానుకొని-విచిత్ర సమాధిలో తన హృదయ స్పందన వినేవాడు.

ఇక ఎస్టబాన్‌కు తాను గడుపుతున్న జీవితం తనకు సరిపోయింది. అతని హృదయంలో మరొక ప్రేమకు తావు లేదు... మాన్యుయేలుకంటే ఇతని హృదయం విశాలమైన దని కాదు. దానిస్వరూప స్వభావా లటువంటివి! కాని ఇప్పు డతనికొక విషాదకరమైన రహస్యం తెలిసింది. ఎంతటి ప్రేమికులైనా ఒకరికంటె మరొకరు, రెండోవ్యక్తిని తక్కువగానే ప్రేమిస్తుంటారు... ఇద్దరూ సమానంగా మంచివారు కావచ్చు. ఇద్దరూ సౌందర్యమూర్తులే కావచ్చు. కాని ఇద్దరి ప్రేమలూ ఒకేస్థాయిలో ఎన్నడూ ఉండవు. ఈ రహస్యాన్ని తెలుసుకున్న ఎస్టబాన్ తనగదిలో దగ్ధమై పోతూన్న క్రొవ్వొత్తి ముందర కూర్చొని, తనసోదరునిలో కల్గిన యీ మార్పును గురించి ఊహించుకుంటూ తమ జీవితబంధాలు యీ విధంగా విడిపోతున్నట్లు, తారుమారై పోతున్నట్లుగాను తలంచి ఆశ్చర్యచకితు డయ్యేవాడు...

ఒక రోజున మాన్యుయేల్ ఒక వీధివెంబడి వెడుతున్నాడు. ఇంతలో నొక కుర్రవాడు పరుగెత్తుకొని వచ్చి 'పెరి

కోల్ నిన్ను తొందరగా ఒకసారి వచ్చి వెళ్ళమంది' అని చెప్పాడు. తక్షణం వెనక్కి తిరిగి ప్రదర్శనశాలకు చేరాడు మాన్యుయేల్. నిర్లిప్తంగా, సరాసరి పెరికోల్ గదిలోకి వెళ్ళి నిలబడ్డాడు. కెమీలా పెరికోల్‌కు, మాన్యుయేల్‌తో అవుసర మొచ్చింది... అందుచేత, ముందు కొన్ని తియ్యని మాటలుచెప్తూ విగ్గును సవరించుకుంటూ 'నువ్వు ఎవరికైనా ఉత్తరాలు వ్రాసిపెడుతూంటావు కదూ! నాకు నువ్వొక లేఖ వ్రాసిపెట్టాలి. దయవుంచి లోపలికిరా' అని అతనిని ఆహ్వానించింది. అతడు రెండడుగులు ముందుకు వేశాడు.

"మీ యిద్దరిలో ఎవ్వరూ కూడా నన్నుచూడటానికి ఒక్క సారైనా రాలేదు. అదేం మర్యాద? పోనీ! యింతకీ నువ్వెవరు? ఎస్టబాన్‌వా? మాన్యుయేల్‌వా?"

"మాన్యుయేల్‌ని"

"ఎవరయినా ఫరవాలేదు. మీ రిద్దరూ ఒకేలాగున ప్రవర్తించారు. ఒక్కరూ నన్ను చూడటానికి రాలేదు. ఇక్కడ యీ పాడు సంభాషణలు నాలుగూ వల్లెవేస్తూ రోజంతా దిగాలుపడి కూర్చుంటాను. ఎవ్వరూ దగ్గరకు రారు. కారణం, నేను నటిని కావడమేనా!"

మాన్యుయేల్‌కు యీ ధోరణి వింతగాను, అయోమయంగాను తోచింది. అతని దుబ్బులాంటి జుట్టులోంచి వెర్రిగా ఆమెకేసి చూస్తున్నాడు.

"నాకు ఒక లేఖ వ్రాయడానికి నిన్ను నియుక్తుణ్ణి చేస్తున్నాను. అది చాల గుప్తంగా ఉంచవలసిన విషయం

సుమా! కాని నీ వైఖరిచూస్తే నామీద నీకు రవ్వంతైనా అభిమానం ఉన్నట్లు తోచదు. అలాంటి నీచేత ఉత్తరం వ్రాయించటమంటే - సారా దుకాణాల్లోకి పోయి బిగ్గరగా అరవడమన్నమాట! అలా చూస్తావేం మాన్యుయేల్...? నువ్వు నా స్నేహితుడివి కావూ?"

"ఔను! సిన్యోరా"

"పోనీ నువ్వు వెళ్ళి ఎస్టబాన్‌ను పంపు."

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపొయ్యాయి.

ఆమె తలఎత్తి "ఇంకా ఇక్కడేవున్నావా? అభిమానం లేకపోయినా?" అన్నది.

"ఔను! సిన్యోరా!! ఏపని చెయ్యడానికైనాసరే నన్ను నువ్వు పూర్తిగా నమ్మవచ్చును-నమ్ము......"

"నేను ఒకటి రెండు ఉత్తరాలు నీ చేత వ్రాయిస్తే అందలి విషయాన్ని మరొక మానవ మాత్రునికి ఎప్పటికీ చెప్పవుకదూ? ఆఖరుకి అవి నువ్వు వ్రాసినవనే విషయం కూడా?"

"అలాగే సిన్యోరా"

"లీమా సెయింట్ రోస్ సాక్షిగా?"

"అలాగే"

"ఎవరయినా నిన్ను ఎద్దు మొద్దు స్వరూప మనుకుంటారు మాన్యుయల్! నిన్ను చూస్తే నాకు వళ్ళు మండి పోతోంది. నువ్వు ఏమీ తెలియని తెలివితక్కువ దద్దమ్మవు మాత్రం కావు. అలా కనిపించడం లేదుకూడా! 'అలాగే'

అని ముక్తసరిగా ఒక్కమాట మాట్లాడి ఊరుకోకు... తెలివితక్కువగా ప్రవర్తించకు... సరేనా! లేకపోతే ఎస్ట్రబాన్‌కు కబురు చేస్తాను, అసలు విషయమేమిటో చెప్పు?"

మాన్యుయేల్ పెదిమలు కదిలాయి... అనవసరమైన ఉద్వేగంతో స్పానిష్ భాషలో "మేరీ కన్య సాక్షిగా... లీమా సెయింట్ రోజ్ సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. ఉత్తరంలోని ప్రతి అక్షరాన్నీ ప్రాణప్రదమైన రహస్యంగా కాపాడుకొంటాను." అన్నాడు.

"ఆఖరుకు ఎస్ట్రబాన్‌కు కూడా ఈ విషయం చెప్పవు కదూ"

"చెప్పను"

"సరే! బాగానేవుంది!!" అంటూ అతనిని అక్కడ నున్న మేజాబల్ల ముందు కూర్చోమని సైగచేసింది. వ్రాయడానికి కావలసిన పరికరాలు యావత్తు ఆ మేజాబల్లపై నున్నాయి. ఆమె గదిలో అటు యిటూ పచార్లు చేస్తూ, అలక్ష్యంగా శాలువను కప్పుకొంటూ కంపించే పెదిమలతో వ్రాయవలసిన విషయాలను మాన్యుయేల్‌కు చెబుతోంది.

"యువర్ ఎక్సలెన్సీ, హస్తాలను కెమీలా పెరికోల్ ముద్దు పెట్టుకుంటున్నది - వద్దు... మరొక కాగితం తీసుకొని వ్రాయి- 'సినోరా మికెయిలావిల్లెగాస్' యువర్ ఎక్సలెన్సీ హస్తాలు ముద్దాడి యీ విషయాలు చెబుతున్నది. మీ అసూయా పరులైన, అబద్ధాలకోరులైన, స్నేహితులకు-నేను బలియై పోతున్నాను. ఇంక ఒక్కక్షణంకూడా మీ అనుమా

నాన్నీ, అసూయనూ సహించలేను. ఏలినవారి సేవకురాల్ని నేను. ఈ చరణదాసి అనవరతం తమ స్నేహాన్నే అభిలషిస్తున్నది. ఎన్నడూ యీ స్నేహానికి ద్రోహం తలపెట్టలేదు. తలపెట్టాలనే తలంపుకూడా రాలేదు. కాని తమరు అంత తొందరగా విశ్వసిస్తోన్న అపవాదులను భరించ లేను. పోట్లాడే శక్తికూడా నాకు లేదు...పెరికోల్ అని పిలువబడే ఈ 'సినోరా విల్లెగాస్' ఏలినవారు పంపిన బహుమతులన్నింటినీ తిప్పి పంపుతున్నది. తమ విశ్వాసానికి అపాత్రురాలనైనా నాకు-ఆ బహుమతులు ఆనందాన్ని కల్గించలేవు." ఇంకా అనేక నిముషాలపాటు పెరికోల్ ఆ గదిలో పచార్లు చేస్తూనే ఉంది.

ఆలోచనలు ఆమెను దహించివేస్తున్నాయి. మళ్ళీ మాన్యుయేల్ వైపు చూడకుండానే "మరో కాగితం తీసుకో......'మీ కేమన్నా మతి పోయిందా? మళ్ళీనాకు మరో ఎద్దును బహూకరించడానికి ప్రయత్నించకండి. అది భయంకర యుద్ధానికి దారి తీసింది. భగవంతుడు మిమ్మల్ను రక్షించుగాక! శుక్రవారం రాత్రికి-సరిగ్గా ఆ దేచోటికి అదే సమయానికి... నేను కొంచెం ఆలస్యంగా రావచ్చు... 'నక్క' కండ్లు మూసి, రావాలిగా......అంతే... చాలు" అంటూ చెప్పింది పెరికోల్. ఈ లేఖనుకూడా వ్రాయడం ముగించి మాన్యుయేల్ లేచి నిలబడ్డాడు!

"నువ్వు తప్పులేమీ వ్రాయ లేదుగదా!"

"వ్రాయలేదు"

"ఇదిగో! నీ డబ్బు"

మాన్యుయేల్ డబ్బు తీసికొన్నాడు.

"నాకు నువ్వు చాలా ఉత్తరాలు వ్రాసి పెట్టాలి సుమా! మామూలుగా నా ఉత్తరాలన్నీ పిగ్మోమామ వ్రాసి పెడుతూ ఉండేవాడు. కాని యీ విషయాలుమాత్రం అతనికి తెలియడం నాకు సుతరామూ యిష్టంలేదు. గుడ్ నైట్! భగవంతుడు నీకు మేలు చేస్తాడు"

మాన్యుయేల్ మెట్లుదిగి బయటకు వచ్చి - అక్కడే చెట్టుమాటున ఎంతోసేపు చైతన్యహీనుడై నిలబడ్డాడు. తన సోదరుడు నిరంతరం పెరికోల్‌కోసం తపిస్తున్నాడని ఎస్టబాన్‌కు తెలుసు. కాని మాన్యుయేల్ ప్రత్యక్షంగా ఆమెను కలుసుకున్నాడని మాత్రం అతను భావించడం లేదు. ఆ తరువాత రెండు నెలలవరకూ తరుచుగా ఒక కుర్రవాడు పరుగు పరుగున రావడం, నువ్వు ఎస్టబాన్‌వా - మాన్యుయేల్‌వా-అని ప్రశ్నించడం, తాను ఎస్టబాన్‌నని సమాధానం చెప్పగానే, మాన్యుయేల్ తక్షణం ప్రదర్శనశాలకురావాలని ఖబురుచెప్పడం, వెళ్ళిపోవడం జరిగేది. మామూలు ఉద్యోగానికే పిలుపులు వస్తున్నాయనుకున్న ఎస్టబాన్‌కు అనుకోకుండానే ఒక సంఘటన ఎదురయింది!

అది అర్థరాత్రి. ఎస్టబాన్ పడుకొని క్రొవ్వొత్తి వెలుగును చూస్తున్నాడు. దానిప్రక్కనేకూర్చొని మాన్యుయేల్ ఏదో పని చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఎవరో తలుపును మృదువుగా తట్టినట్లనిపించింది. మాన్యుయేల్ తలుపు

తెరిచాడు. వంటినిండా ముసుగు కప్పుకున్న ఒక స్త్రీమూర్తి లోపలకు ప్రవేశించింది. ఆమె రొప్పుతున్నది. ముసుగుతీసి ఆవల పారవైచి తొట్రుపాటుతో "తొందరగా కాగితం కలం తియ్యి. నువ్వు మాన్యూయేల్ వేనా? ఔను! నువ్వు నాకో ఉత్తరం వ్రాసిపెట్టాలి" అన్నది. ఆ క్షణంలో ఆకస్మికంగా ఆమె చూపులు, జ్యోతుల్లా తెరచుకొని తనవైపే చూస్తున్న ఎస్టబాన్ కళ్ళమీద పడ్డాయి.

ఆమె ఏదో గొణగడం ప్రారంభించింది... "నువ్వు నన్ను క్షమించాలి. ఇప్పుడు బాగా ఆలస్యమయిందని నాకు తెలుసును. కాని గత్యంతరం లేకపోయింది. నేను రాక తప్పింది కాదు." ఆ తరువాత మాన్యుయేల్ కేసి తిరిగి అతని చెవిలో ఏదో రహస్యంగా చెప్పింద.

వ్రాయి - "సాంకేతిక స్థలాల్లో అలా నిరీక్షించడం నా కలవాటులేదు-" పూర్తిఅయిందా వ్రాయడం-"ఎడ్లతో కుస్తీ పట్టడానికి ♦నీ కంటే మంచి వస్తాదులు లీమాలోనే ఎందరో ఉన్నారు. కాని నాకంటే ఉత్తమనటి ఈ పృథ్వీ తలంలో ఎక్కడా లేదుసుమా! ఈ సదవకాశం ఇంక నీకీ జన్మలో రాదు"—— వ్రాశావా——"నేను మళ్ళా అలా నిరీక్షించడం—— ఈ జన్మలో జరగదు——"

కెమీలా పెరికోల్ అలా వంగి తన సోదరుని చెవిలో ఏవో రహస్యాలు చెబుతున్న దృశ్యం చూసి-తనకు అర్థం కాని ఏదో పరిణామం దానంతటచే జరిగిపోతోందని గ్రహిం

♦ స్పెయిన్ జాతీయులకు ఇసాళ వినోదం.

చాడు ఎస్టబాన్. తను ఎక్కడికో అధఃపాతాళం లోకి, అంధ కారంలోకి క్రుంగి పోతున్నట్లపించింది.

ఈ ప్రణయ దృశ్యాన్ని, ప్రకంపిత నేత్రాలతో మరొక్కసారి పరికించాడు ఎస్టబాన్. ఏదో రమణీయస్వర్గం నుండి తనని శాశ్వతంగా బయటకు గెంటివేసి ఎవరో తలు పులు ఫెడీల్‌మని మూసినట్లు అనిపించింది. ప్రాయడంపూర్తి అయిన తక్షణం - కెమిలా పెరికోల్ - ఆ జాబునందుకొని, ఒక నాణెమును బల్లమీదకు విసిరి, ముసుగు వేసికొని- ఏదో తొందరగా, రహస్యంగా చెబుతూ - గదిలోంచి వెళ్ళి పోయింది. మాన్యుయేల్ తిరిగివచ్చి తల పట్టుకొని కూల బడ్డాడు. ఆమెను మనసారా పూజించాడతడు. పదే పదే ఆమెను ధ్యానించుకున్నాడు. అతని మనస్సులో మరో ఆలో చనకు తావే లేదు. మరోధ్యాస లేదాతనికి... ఒకేపాట పదే పదే ప్రతిధ్వనిస్తున్నది. ఇప్పుడిప్పుడే అతనికి ఎస్టబాన్ మనస్థితి అవగత మౌతున్నది. అతనికేదో వినిపిస్తున్నది. వెళ్ళు మాన్యుమేల్... వెళ్లు... ఆమెను వెన్నాడు. ఇంక ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యవద్దు. ప్రతిజీవికీ ఈ విశాల ప్రపంచంలో స్థానం ఉంది.'

మాన్యుయేల్ బయలుదేరాడు. ఇప్పుడు ఎస్టబాన్ మూర్తి అతనికి కండ్లకుకట్టినట్లుకన్పిస్తున్నది. తనకుపీఠ్యాలు చెబుతున్నాడు తన సోదరుడు. అతని హృదయం భయంతో నిండిపోయింది. తన సోదరుని జీవితంతో తనకుగల అను బంధంముందు - ఈ ప్రాపంచిక స్నేహబంధాలన్నీ తృణ ప్రాయంగా కన్పిస్తున్నాయి. తనకు మేడ్రిమేరియా డెల్

పిలార్‌తో గల బంధం-ఆఖరుకు పెరికోల్‌తో గల సంబంధం అన్నీ పేలవమైన ఛాయామాత్రంగా పాలిపోయి కన్పిస్తున్నాయి. ఇంతకీ తనకు కావల్సిం దెవరు? పెరికోల్ - ఎస్టబాన్- ఇద్దరిలో ఎవరు! ఎస్టబాన్ అనుభవిస్తున్న బాధ యావత్తూ మాన్యుయేల్‌కు బాగా తెలుస్తూనే వుంది. తక్షణం దానికోసం, తన సర్వస్వాన్నీ త్యాగం చేయాలని పించింది. నిజానికి ఈ విషయంలో ఎస్టబాన్ చేయతగ్గ ఆరోపణ ఏదీ లేదు. అది అసూయ కాదు. ఇంతకు ముందు అలాంటి భావం ఒకరిమీద ఒకరికి కలగలేదు.

జరిగినదల్లా ఒకరిహృదయం సోదరునిలో అద్వైతమై పోయింది. కాని రెండవ హృదయం ఆ స్థితిలో లేదు. మాన్యుయేల్‌కు ఈ విషయం అర్థంకాదు. తను అనవసరంగా నిందింపబడుతున్నాననే భావం అతనికి కలుగుతోంది. కాని ఎస్టబాన్ అనుభవిస్తున్న భాధను అతను గుర్తించాడు. ఉద్రేకంతో ఎస్టబాన్‌ను కౌగలించుకోవాలని ప్రయత్నించే వాడు. కాని ఎస్టబాన్ మాత్రం వెనక్కు వెనక్కు వెళ్ళి పోయేవాడు. ఒక్క క్షణంలో - పెరికోల్ ప్రణయమూర్తిని కూకటివ్రేళ్ళతో తన హృదయ ఫలకంనుండి పెకలించి వేశాడు. దీపం ఆర్పివేసి మంచంమీద పడుకున్నాడు. ఎందుకో వణికిపోతున్నాడు. ఉద్రేకంతో "ఆ స్త్రీకి నేను కడసారి ఉత్తరం ఇదే. ఇంక ఎన్నడూ అలాంటి పని చేయను. ఆమె మరొకరిని చూసుకోవచ్చును. ఎప్పుడైనా నాకోసం కబురు పంపించినా - వచ్చి పిలచినా అదేమాట చెప్పు. స్పష్టంగా ఎరుకపరుచు. అంతటితో ఆమెకూ నాకూ

గల సంబంధం తెగిపోతుంది" అంటూ రాత్రి ప్రార్థనలు మొదలు పెట్టాడు. మొదటి చరణం పూర్తిగాకుండానే, ఎస్టబాన్ లేచి క్రొవ్వొత్తిని వెలిగిస్తున్నాడని తెలుసుకున్నాడు మాన్యుయేల్.

"ఏమిటి?" అని అడిగాడు.

"నేను అలా ఒకసారి బయటకు వెళ్ళివస్తా" అన్నాడు భారంగా ఎస్టబాన్... అంతలోనే, కోపంతో "నాకోసం నువ్వింతకుముందన్న మాటలు పూర్తిగా అనవసరం. ఆమెకు నువ్వు లేఖలు వ్రాసినా వ్రాయకపోయినా నాకేమీ సంబంధం లేదు. నాకోసం నువ్వాపనిని మానుకోవద్దు. దానికీ నాకూ సంబంధమేమిటీ!" అన్నాడు.

"అతిగా మాట్లాడక పడుకో! వెర్రివాడా! నీకోసం నేనా మాటలు అన్నానని ఎవరు చెప్పారు నీకు? ఆమెకలా ఉత్తరాలు వ్రాసి చచ్చుడబ్బు సంపాదించాలని ప్రయత్నిస్తున్నానని నీ వనుకుంటున్నావా?"

"అది సరే! నువ్వామెను ప్రేమించావు. నాకోసం నువ్వు దేనినీ మార్చుకో నవసరంలేదు."

"ఆమెను ప్రేమించడమా? ఎస్టబాన్! నువ్వు పూర్తిగా వెర్రివాడివి. నేనామె నెలా ప్రేమించగలను? అలాంటి అవకాశం నాకెక్కడుంది? ఆ అవకాశమే వుంటే అలాంటి వుత్తరాలు నాచేత ఆమె వ్రాయించగలిగేదా? అలా ప్రతిసారీ ఒక నాణెమును విసరిపోయేదా? నువ్వు పూర్తిగా వెర్రిలో పడ్డావు ఎస్టబాన్! అంతే!!"

చాలసేపు నిశ్శబ్దత ఆవరించింది. ఎస్టబాన్‌కు నిదుర పట్టలేదు. మేజా బల్లమీద తట్టుతూ దీపంముందు కూర్చు న్నాడు.

"తెలివితక్కువ పెద్దమ్మా! పోయిపడుకో" అంటూ కేకపెట్టాడు మాన్యుయేల్. అతను తమ రహస్యభాషలో మాట్లాడుతున్నాడు. తన హృదయంలో ఏదో క్రొత్తబాధ రేకెత్తింది.

"నేను పడుకోను. అలా బయటకు వెళ్ళివస్తాను" అంటూ తనకోటును తీసుకుంటున్నాడు ఎస్టబాన్.

"ఇప్పుడు అలా షికారుకి వెళ్ళడానికి ఏమాత్రం వీలులేదు ... అర్ధరాత్రి ... రెండుగంటలు అయివుంటుంది. బయట హోరుమనివర్షం. అలా జోరుగా కురుస్తున్నవానలో కటికి చీకట్లో గంటలకొద్దీ షికారు చెయ్యడానికి నేను సుతరామూ ఒప్పుకోను. ఎస్టబాన్! ఒట్టుపెట్టుకుని చెబు తున్నా. ఆమె ప్రస్తావనే తేవద్దు. ఆమెను నేను ప్రేమించను. కొంతకాలం మాత్రం అలా జరిగింది. అంతే!!"

ఈ మాటలనేసరికే ఎస్టబాన్ తలుపు బయట చీకట్లో నిలబడివున్నాడు. మన జీవితంలోకల్లా గొప్ప నిర్ణ యాలు ప్రకటించేటప్పుడు ఎలాటి ఉచ్చైస్వరంతో మాట్లాడుతామో అదేవిధంగా "నేను నీకు అభ్యంతరంగా ఉన్నాను" అన్నాడు ఎస్టబాన్.

మాన్యుయేల్ ప్రక్కమీదనుంచి లేచాడు. తనను శాశ్వతంగా ఒంటరివాడ్ని చేసి - ఎస్టబాన్ వెళ్ళిపోతున్నా

డని ఏదో పాలికేక అతని హృదయ కుహరంలో పదేపదే ప్రతిధ్వనిస్తోంది.

"ఎస్టబాన్! తిరిగిరా నాయనా!...భగవన్!!"

ఎస్టబాన్ తిరిగివచ్చి ప్రక్కమీదకుపోయి పడుకున్నాడు. కొన్ని వారాలు చెప్పుకోతగ్గ సంఘటనలేమీ లేకుండానే గడిచిపోయాయి. ఒకనాటి సాయంకాలం, పెరికోల్ దగ్గరనుంచి మాన్యుయేల్‌కు కబురు వచ్చింది. మాన్యుయేల్‌కు తన నిర్ణయాన్ని ప్రకటించేందుకు తగిన అవకాశం లభించింది. ఇకముందెన్నడూ ఆమెకు ఉత్తరాలు వ్రాయదలుచుకోలేదని కటువుగా చెప్పి పంపించాడు.

ఒకరోజు సాయంత్రం, ఒక లోహపు ముక్కకు మోకాలు కొట్టుకొని గాయం చేసికొన్నాడు మాన్యుయేల్. అన్నదమ్ముల్లో ఎవ్వరూ ఇంతవరకు ఒక్కరోజుకూడా జబ్బుపడలేదు. ఇప్పుడు తనకాలు అలా వాచిపోవడం చూసి మాన్యుయేల్ దిగ్భ్రమ చెందాడు. విపరీతంగా బాధపడుతున్నాడు. ఎస్టబాన్ సోదరునిముఖంలోకి సూటిగా చూస్తూ ఆబాధ తీవ్రతను ఊహించటానికి ప్రయత్నిస్తున్నాడు. చివరకు ఒక అర్ధరాత్రివేళ, పట్టణంలో ఒక మంగలి గుర్తుకు వచ్చాడు ఎస్టబాన్‌కి. అతడెంత అనుభవజ్ఞుడైన మంగలో, శస్త్రచికిత్సలో అతనికిగల ప్రావీణ్యత ఎట్టిదో వర్ణిస్తూ వ్రాసి, వీధిలో వ్రేలాడకట్టబడిన బల్ల అతని కండ్లముందు మెదిలింది. తక్షణం అతన్ని వెతుక్కుంటూ పరుగెత్తాడు

ఎస్టబాన్. ఆ వీధి చేరి, అతని యింటిముందు నిలబడి తలుపు తట్టాడు. ఒక స్త్రీ కిటికీదగ్గరకువచ్చి, ఆయన లేడనీ, తెల్ల వారితేనేగాని రాడనీ చెప్పిపోయింది. మిగిలిన రాత్రంతా భయంకరంగా గడిచింది. డాక్టర్ వచ్చి మందు యివ్వగానే అంతా నయమైపోతుందని, ఒకరికొకరు ధైర్యం చెప్పు కుంటున్నారు. డాక్టరు ఒక్క క్షణంలో ఆ బాధను మటు మాయం చేస్తాడనీ - ఒకటిరెండు రోజుల్లో బహుశః ఇంకా అంతకంటే తక్కువ కాలంలోనే మాన్యుయేల్ మళ్ళీ లేచి తిరగవచ్చుననీ హామీయిస్తున్నాడు, ఎస్టబాన్.

మంగలి మర్నాడు వచ్చి, రకరకాల మందులు వ్రాశాడు. గంట గంటకూ గాయంమీద చల్లటి గుడ్డలు వేస్తూండమని చెప్పి వెళ్ళిపోయా డావైద్యుడు. సోదరు లిద్దరూ బాధోపశమనం కోసం ఎదురుచూస్తూ - కూర్చు న్నారు. అలా ఒకరి ముఖాల్లో కింకొకరు చూస్తూ, ఆ శుభ పరిణామంకోసం ఎదురుచూస్తున్నకొద్దీ పరిస్థితి యింకా దిగ జారి పోతున్నది. గంటగంటకూ ఎస్టబాన్ గాయంమీద తడిగుడ్డలు వేస్తూనే వున్నాడు. తడిగుడ్డతో గాయంమీద అద్దినప్పుడల్లా మాన్యుయేల్ వెర్రిబాధను అనుభవిస్తున్నాడు. ధైర్యస్థుడే అయినప్పటికీ బాధ ఓర్వలేక, కేకలు పెడుతూ ప్రక్కమీద దొర్లుతూనే ఉన్నాడు. ప్రొద్దు గ్రుంకింది. ఎస్టబాన్ అలాగే తన అన్నగార్ని అంటిపెట్టుకుని ఉంటు న్నాడు. తొమ్మిది ... పది ... పదకొండు ... గడియారం గంట కొట్టినప్పుడల్లా - తడిగుడ్డతో గాయాన్ని అద్దడానికి బయలు

చేరేవాడు ఎస్టబాన్. ఆ పనిమాత్రం చెయ్యవద్దని వారించే వాడు మాన్యుయేల్. మాన్యుయేల్ తెలివి క్రమంగా తప్పిపోతున్నది. తెలివి ఉన్నంతసేపూ అతడు దగ్గరకు రాకుండా పారద్రోలిన ఆలోచనలన్నీ ఇప్పుడు విజృంభిస్తు న్నాయి. అతడు వెర్రిగా మాట్లాడుతున్నాడు.

అర్ధరాత్రి రెండుగంట లయ్యేసరికి – మాన్యుయేల్ ప్రక్కమీదనుంచి తల నేలకేసి కొట్టుకొంటూ – వెర్రి కోపంతో అరవటం మొదలుపెట్టాడు.

"నిన్ను భయంకరమైన నరకంలోకి భగవంతుడు త్రోసి పారవేయాలి. వెయ్యి దెయ్యాలు నీపైబడి పీక్కు తినాలి – ఎస్టబాన్! భగవంతుడు నీ జీవుణ్ణి శపించాలి! వింటున్నావా?"

ఈ మాటలు విని ఎస్టబాన్ బయట హాలులోకి వెళ్ళి తలుపుకు జేర్లబడ్డాడు... అతని పెదవులు, కళ్ళూ తెరచుకొనే వున్నాయి. ఇంకా అతనికి ఆమాటలే వినిపిస్తున్నాయి.

"అవును; ఎస్టబాన్! భగవంతుడు నికృష్టమైన నీ జీవుణ్ణి శపించాలి... నాకు కావలసినదానికీ, నాకూ నువ్వు అడ్డం తగిలావు. ఆమె నాది. వింటున్నావా? నీకేమి అధికారం ఉంది?___ ___ ___?" ఆ తరువాత వివరంగా పెరికోల్‌ను వర్ణించడం మొదలుపెట్టాడు.

ఈ విధంగా ప్రతి గంటకూ మాన్యుయేల్ అంటూ వచ్చాడు. తన సోదరుని మనస్సు సరిగా లేక అలామాట్లాడు తున్నాడని తెలుసుకొనేందుకు చాలాసేపుపట్టింది ఎస్టబాన్‌కు.

తెల్లవారింది... పరిస్థితి కొంత బాగుపడింది. ఈ ప్రశాంతమైన మన స్థితిలో మాన్యుయేల్ నిశ్చలంగా—

"ఎస్టబాన్ ! నా వంట్లో యిప్పుడు చాలా బాగుంది నాయనా! ఈ తడిగుడ్డలు మంచిపనే చేశాయి. రేపటికి నేను లేచి నడవగలను. నువ్వే చూస్తావుగా! ఇన్నాళ్ళూ నీకు కంటిమీద కునుకే లేదు! ఇంక నిన్ను బాధపెట్టను లే నాయనా."

"ఇది నాకేమీ బాధగా లేదు."

"తడిగుడ్డలు గాయంమీద వేయడానికి నువ్వు ప్రయత్నించినప్పుడల్లా నేను నిన్నాడిపోసుకుంటూనే వున్నాను. బాధ భరించలేక ఏమేమో అన్నాను ... చెడ్డమాటలే. అవన్నీ నిజమనుకోవద్దు..."

కొంతసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. ఎస్టబాన్ నోట్లోంచి మాటలు బయటకు వచ్చి మౌనాన్ని భంగపరచాయి... "నే ననేది—పెరికోల్‌కు కబురుచేస్తే? ఆమె వచ్చి నిన్ను చూసిపోతుంది. నీకు అలా అనిపించటంలేదూ?"

"ఆమెగురించి యింకా మాట్లాడుతున్నావా? ఆమెను గురించి నాదగ్గర ఒక్కమాట కూడా మాట్లాడవద్దు."

కాని ఈ మాటలతో ఎస్టబాన్ సంతృప్తి చెందలేదు. అతని హృదయాంతరాళాల్లోంచి మరికొన్నిమాటలు బయట కొచ్చాయి.

"మాన్యుయేల్! నీకూ, పెరికోల్‌కు నేను అడ్డం వస్తున్నానని, నువ్వింకా అనుకుంటున్నావు. అనుకోవడం లేదూ?

ఆ విషయంలో ఎన్నడూ నీకు అడ్డురానని చెప్పలేదూ? ఆమె దగ్గరకు నువ్వు చేరితే సంతోషించేవాళ్ళల్లో నేను మొదటివాణ్ణి."

"నువ్వు అంటూన్న దేమిటి ఎస్టబాన్? నేను భగవంతుని సాక్షిగా ప్రమాణంచేసి చెబుతున్నాను. అలాంటి దేమీ లేదు... ఆమెమీద నా కేటువంటి ఆసక్తి లేదు. ఆ విషయం నువ్వుకూడా ఎప్పుడు మరచిపోతావు? మళ్ళీ ఆమె పేరు ప్రస్తావిస్తే, నాకు కోపం వస్తుంది సుమా?"

"మాన్యుయేల్! ఆ విషయం ఎన్నడూ నీదగ్గర ప్రస్తావింపను కాని, గాయంమీద తడిగుడ్డలు ఒత్తడానికి నేను ప్రయత్నించినప్పుడు, నామీద నీకు కోపం వచ్చింది. అప్పుడు ఆమె విషయంలోగూడా నన్ను తిట్టిపోశావుమరి."

"చూడు! దానికి నేను బాధ్యుణ్ణికాదు...నాకాలు అంత బాధపెట్టింది నన్ను."

"నీకూ, పెరికోల్‌కు అడ్డం వస్తున్నానని తిడుతూ, నన్ను నరకానికి పొమ్మని నువ్వు శపించలేదూ?"

"నిన్ను శపించడమా? అటువంటిమాటలు ఎలా అంటున్నావు నువ్వు? నువ్వు నిజంగా వెర్రివాడివై పోతున్నావు సుమా! ఎస్టబాన్...నువ్వు కేవలం అపోహ పడుతున్నావు. నువ్వు నిద్రంటే పూర్తిగా మరచిపోయావు... నేను నీకు శనిలా దాపురించాను. నీ ఆరోగ్యం పాడై పోతున్నది. కాని - నిన్నింక బాధపెట్టదలచుకో లేదు. నీకంటే నా కెవరున్నా రీలోకంలో. నా సర్వస్వమూ అయిన నిన్ను

శపిస్తానా? నువ్వు నమ్ముతున్నావా? నువ్విలా తడిగుడ్డలు గాయంమీద వత్తినప్పుడు వెర్రిబాధతో నన్ను నేను మరచి పోయి ఉంటాను. అంతే! ఈ విషయం బాగా ఆలోచించు, నీకే తెలుస్తుంది. మళ్ళీ గంట అయింది తడిగుడ్డలు తీసుకురా! ఈసారి నిన్ను ఒక్కమాట కూడా అనను."

"ఈసారి నీకు బాధకలగకుండా పైపైన అద్దుతాను."

"నేను తొందరగా లేచి తిరగాలనుకుంటున్నాను. ఆ సంగతి నీకు తెలుసును. ఆ గుడ్డలు గాయంమీద పెట్టు. ముందు ఒక క్షణం ఆ శిలువను నాచేతి కివ్వు. ఎస్టబాన్‌కు వ్యతిరేకంగా నే నేదన్నా అంటే – అది బుద్ధి పూర్వకంగా అనలేదని, ఈ ఏసుప్రభువు సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నా కాలి బాధవల్ల, ఏవో పీడకలలు కంటూ, మాట్లాడిన పిచ్చిమాటలవి. కొద్దికాలంలోనే భగవంతుడు నన్ను బాగుచేస్తాడు. ఆ గుడ్డలతో యిలా వత్తు ... నేను సిద్ధంగానే ఉన్నాను."

"మాన్యుయేల్, అలా గట్టిగా నొక్క నవసరంలేదు. మళ్ళీ గాయం రేగుతుంది. పైపైన తుడిస్తే చాలు."

"అలా వీలులేదు. డాక్టరు చెయ్యమన్నట్లు మనం చేయాల్సిందే. అనను. ఎస్టబాన్! ఈసారి నిన్ను ఒక్కమాటకూడా అనను."

మళ్ళీ కథ మొదలుకొస్తుంది. ఒక భాగం పడుచు గోడ బద్దలు కొడుతున్నది. ఒక మతాచార్యుడు హాలులోకి వచ్చి తలుపు తట్టుతున్నాడు. ఆయింట్లోని జనమంతా

గడిముందు జేరుతున్నారు. ఈ దౌర్భాగ్యు లిద్దరినీ తెల్లవార గానే ఇంట్లోంచి గెంటివేస్తానని ఇంటి యజమాని హామీ యిస్తున్నాడు. ఎస్టబాన్ దీపం పుచ్చుకొని, తలుపు తీసి, తమమీద విరుచుకు పడుతున్న ఇరుగు పొరుగువారల తిట్లను ప్రశాంతంగా విని చక్కా పోయాడు. మాన్యుయేలు వెర్రి కేకలు పెడుతున్నప్పుడు అతని నోరు నొక్కుతున్నాడు. దీనితో మాన్యుయేలు యింకా రెచ్చిపోయి మిన్ను విరిగి మీద పడేలా పెద్ద బొబ్బలు పెడుతున్నాడు.

మూడవనాటి రాత్రి ఎస్టబాన్ మతాచార్యునికోసం కబురుపెట్టాడు. అప్పుడే మాన్యుయేల్ సంస్కారం పొందాడు. ఆ రాత్రే అతని జీవితం సమాప్తమై పోయింది.

ఆ తరువాత ఆ యింటి సమీపానికే రావడం మానుకున్నాడు ఎస్టబాన్. వెర్రివానిలా దూర దూరంగా తిరుగాడు తున్నాడు. 'శాంతా మేరియా రోసాడిలాస్ రోసాస్' మతాధ్యక్షురాలికి ఈ వార్త తెలిసింది. జరుగ వలసిన తతంగమంతా ఆమె ఆదేశానుసారం జరిగిపోయింది. చివరకు వీధులవెంట వెతుక్కుంటూ పోయి ఆమె ఎస్టబాన్‌ను కలుసుకున్నది. ఆమె దగ్గరకు రావడం అతను చూశాడు. అనుమానాస్పదంగా ఆమెవైపు దృష్టి సారించాడు. ఆమె దగ్గరకు వచ్చి నిలబడగానే మొహం మరో ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

"నాకు నువ్వొక సహాయం చెయ్యాలి. వచ్చి ఒక సారి నీ సోదరుణ్ణి చూడవూ ? నాకీ సాయం చెయ్యవూ?"

"చెయ్యను."

"నాకు సాయం చెయ్యవు?"

కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు. ఆమె నిస్సహాయురాలై పోయింది. విషాదాచ్ఛాదితమైన ఆమె స్మృతిపథంలో చాలా సంవత్సరాలనాటి ఒక దృశ్యం నీడలా తారాడుతున్నది. పదిహేను సంవత్సరాల పసిబాలురుగా నున్నప్పుడు ఆ కవలలను తన పాదాలవద్ద కూర్చో పెట్టుకొని, ఏసు ప్రభువుకు శిలువవేసిన కథ తాను చెబుతున్నది. వాళ్ళ విశాల నేత్రాలు తన పెదవులకేసే నిశ్చలంగా చూస్తున్నాయి. ఒక్కసారిగా మాన్యుయేల్ వెర్రిగా కేక వేశాడు. "నేనూ, ఎస్టబాన్ అక్కడ వున్నట్లయితే అలా జరగనిచ్చేవాళ్ళం కాదు" అని. ఆ సంగతులన్నీ జ్ఞాపకం చేసుకుని, ఆవిడ—

"పోనీ! నాకు సాయం చెయ్యకపోతే మానె-నువ్వు ఎవరివో చెప్పు?"

"నేను మాన్యుయేల్ ని."

"మాన్యుయేల్! ఒక్కసారి నాదగ్గరకు వచ్చి కాసేపు కూర్చోవూ?"

రెండు క్షణాల నిశ్శబ్దం."

"కాను."

"కాని - నా మాన్యుయేల్! తండ్రీ! నీ చిన్నతనంలో— నాకోసమని ఎన్నెన్ని పనులు చేసేవాడివో మరచిపోయావా నాయనా? పట్టణంలో తిరిగి నా కెన్ని

పనులు చేసిపెట్టేవాడినో గుర్తులేదూ ? నాకు జబ్బు చేసి నప్పుడు, నాకు ఆహారం వండిపెట్టడమయినా గుర్తున్నదా?"

(మరొక స్త్రీ అయితే అలా అనేదికాదు, "నేను నీకోసం ఎంత పాటుపడ్డానో మరచిపోయావా" అనేది.)

ఆమె ఏదో చెబుతూనే వుంది. ఆమాటలు వినిపించు కోకుండా, నడుస్తూన్న విగ్రహంలా అలా వెళ్ళిపోతున్నాడు ఎస్టబాన్. ఇరవయి అడుగులు వేశాక ఒక్కసారి వెనక్కు తిరిగిచూశాడు. తన యజమాని పిలుస్తున్నా, వెనక్కు తిరగడం యిష్టంలేక, ముందుకు పోవడానికి కాలాడక తట పటాయిస్తున్న కుక్క పరిస్థితిలో ఉన్నాడతను. అంతకుమించి అతనేమీ చేయలేదు. మాన్యుయేల్ భౌతిక దేహాన్ని స్మశానవాటికకు కొనిపోతున్న దృశ్యాన్ని, దూరంగా నాల్గు వీధుల వెనుక, ఊరేగింపుతో బాటే నడుస్తూ చూశాడు ఎస్టబాన్. నల్లటి ముసుగులు, పట్టపగలే వెలుగుతూనే వెలా తెలా పోతున్న క్రొవ్వొత్తులు, శిలువలు, అతనికి లీలగా కనిపించాయి.

* * * *

కవలసోదరులు ఈవిధంగా విడిపోవడం లీమాలో అందరినీ ఆకర్షించింది. వరండాలోకివచ్చి, తివాసీలు ఆరవేసే స్త్రీలు ఒకరిచెవిలో నింకొకరు – యీ విషాద సంఘటనను గురించి చెప్పుకొని సానుభూతిని ప్రకటించారు. సారా దుకా ణాల్లో త్రాగుబోతులుకూడా ఈ వార్తవిని విచారంతో కొద్ది క్షణాల పాటు స్తంభించిపోయినారు. ఎండిపోయిన నదుల

వెంటనూ, పురాతన శిథిలాల వెంటనూపడి పిచ్చిగా తిరుగుతున్న ఎస్టబాన్‌ను చూశామని కొందరు చెబుతున్నారు. మరికొందరు - ఎస్టబాన్ ఒక పెద్ద కొండశిఖరంమీద మంచులో తడిసి ముద్దగా నిద్రపోవడం తాము స్వయంగా చూసినట్లు చెబుతున్నారు. సముద్రంలో తీరానికెంతో దూరంలో ఈదులాడుతున్న ఎస్టబాన్‌ను చూచి, పల్లెవాళ్లు దిగ్భ్రమ జెందామన్నారు. అతడు అనేక ఉద్యోగాల్లో చేరడం, నెలన్నా తిరక్కముందే విరమించుకు పోవడం జరుగుతున్నది. ఒకనెల గొర్రెలకాపరి యైనాడు. మరోనెల బండ్లు దోలాడు... కాని ఎక్కడా స్థిరంగా ఉండలేక దేశం వెంటబడీ, వెర్రిగా తిరుగాడుతున్నాడు. కాని తిరిగి తిరిగి మళ్ళీ లీమా జేరుకొనేవాడు.

ఒకరోజు పెరికోల్ పడకగది తలుపుదగ్గర అతడు కన్పించాడు. ఏదో చెప్పబోతున్నట్లు ఆమె కేసి తేరిపార జూచాడు. కానీ ఏమీ చెప్పకుండానే అక్కణ్ణుంచి అదృశ్యమై పోయాడు.

ఒకరోజు ఉదయం ఒక అమ్మాయి మాడ్రిమేరియా డెల్‌పిలార్ వద్దకు పరుగెత్తుకువచ్చి, కాన్వెంటు ముందర ఎస్టబాన్ తిరుగాడు తున్నట్లు చెప్పింది. (అతన్ని ప్రపంచం మాన్యుయేల్ అనే పిలుస్తున్నది.) మఠాధ్యక్షురాలు పరుగు పరుగున వీధిలోకి వెళ్ళి చూచింది. అతన్ని తిరిగి మామూలు పరిస్థితిలోకి తీసుకువచ్చి, ప్రపంచంలో జీవింపచేయడానికి ఏమిచెయ్యాలని తన్నుతానే పదేపదే ప్రశ్నించుకుంటున్నది.

వీధిలోనికివచ్చి గంభీర నిశ్చల వదనంతో ఎస్టబాన్‌ను ప్రేమతో పిలిచింది.

అతడు అనుమాన పూరితమైన చూపులతో ఆమె కేసి చూస్తున్నాడు. ఆమె మళ్ళీ అతనిని పిలిచింది. ఒక్కఅడుగు ముందుకు వేసింది. కాని ఒక్కసారిగా ఎస్టబాన్ గిరుక్కున వెనక్కితిరిగిపారిపోయాడు. మేడిమేరియా డెల్‌పిలార్-శోక భారంతో వణికిపోయి, బల్లముందు కూలబడి; కోపంతో వణికిపోతూ "ప్రభూ! దివ్యజ్ఞానం ప్రసాదించమని నిన్ను ప్రార్థించాను. కానీ నువ్వు నాకేమీ యివ్వలేదు. నాకు రవ్వంత అనుగ్రహమైనా యివ్వదలుచుకోలేదు. నే నెవరిని! కేవలం పాచిపని చేసే దాసీదాన్నైనా!"

ఇంత అవివేకంగా ప్రార్థించినందుకు కొన్నాళ్ళ వరకూ ఆమె పశ్చాత్తాపంలో పడిపోయింది. అప్పుడే ఒక ఆలోచన తట్టింది. కెప్టెన్ అల్వార్డోకు కబురు పెట్టాలను కున్నది. మూడు వారాల తరువాత అతడ్ని కలుసుకొని పది నిముషాలపాటు ఆమె మాట్లాడటం జరిగింది. కెప్టెన్ ఆ మర్నాడే కుజ్‌కోకు బయల్దేరాడు. ఇప్పుడు ఎస్టబాన్ అక్కడ విశ్వవిద్యాలయంలో ఏదో వ్రాతపని చేస్తు న్నాడట.

కెప్టెన్ అల్వార్డో ఉత్తముడు. ఓంతవ్యక్తి. అత డొక యాత్రీకుడు. అనేక దేశాలను చూసి పెరూ చేరు కున్నాడు. అనేక వాతావరణాలను అనుభవించినవాడు. అతని చూపులు వింతగా ఉంటాయి. చిన్నచిన్న స్వల్ప

విషయాలను చూచే కండ్లుగా వవి... మబ్బులమధ్య మెరిసే నక్షత్రాల వరుసలనూ, వానలో దూరంగా అస్పష్టంగా కనిపించే దిగంతాలనూ చూసే కళ్ళవి !

అతనిలో దాగియున్న వింత వ్యక్తిత్వం, అతని యాత్రలవలన కొంత తెలుస్తుంది. కాని మార్క్వేస్సా డిమాంటి మేయర్ యితడ్ని గురించి మరికొన్ని సంగతులు తన ఉత్తరాల్లో చెప్పింది.

మార్క్వేస్సా ఓసారి తన కుమార్తెకు యిలా జాబు వ్రాసింది.—

"కెప్టెన్ అల్వార్డో ఈ ఉత్తరం నీకు స్వయంగా తీసుకువస్తున్నాడు. నా వజ్రాలుగనీ! భూగోళ శాస్త్రజ్ఞు లెవరైనా ఉంటే, ఇతడ్ని వారికి పరిచయం చెయ్యి. దీని వల్ల వారికి కొంత యిబ్బంది కలుగవచ్చునేమో! కాని ఇతిడు చాలా నమ్మకస్తుడు. ఇంత సుదీర్ఘ ప్రయాణాలు చేసిన మనిషి యెవ్వరూ వారికి కన్పించడు. క్రితం రాత్రి తాను చేసిన కొన్ని యాత్రలను గురించి నాకు చెప్పాడు. చైనా మొదలు ఆఫ్రికావరకు అతడు చూడని చోటు లేదు. ప్రయాణం చెయ్యని ప్రాంతమంటూ లేదు. అతడు కేవలం సాహసికుడుమాత్రమే కాదు. కొత్త చోట్లను కనుగొన్నాననే గర్వ మాతనిలో లేదు. అత డీ యాత్రలు వర్తకంకోసం చేయలేదు. ఒకరోజున నేనాతడ్ని ప్రశ్నించాను, ఇలా దేశ ద్రిమ్మరిలాగ జీవితం ఎందుకు గడుపుతున్నారని. అతడా ప్రశ్నకు సమాధాన మివ్వకుండా తప్పించుకున్నాడు. కాని,

యీ విషయం మన చాకలిద్వారానే తెలుసుకున్నాను. నాతల్లీ! అతనికీ ఒక బిడ్డవుంది!

అతనికీ ఒక కూతురు ఉంది !! ఆమె చిట్టిచిట్టి పనులు చేసే వయసులో ఉండగా మెక్సికో — పెరూలమధ్య మాత్రమే తిరుగుతూ ఉండేవాడు. అనేక వందలసార్లు ఆ బిడ్డ అతనికి వీడ్కోలులూ, ఆహ్వానాలూ యిచ్చింది. అత డనేక వేలమంది ఆడపిల్లలను చూసే ఉంటాడు. మరి వా రందరికంటే ఆమె అంత అందంగా వుంటుందో లేదో మనకు తెలియదు. కాని ఆమె అతని స్వంతం. ఒక చిన్న ఆకు రాలిపోయినంత మాత్రాన ఒక మహావృక్షం నిలువునా కూలిపోవడం నీకు వింతగా కన్పించవచ్చును. కాని ఆ బాధ నీకు తెలియదమ్మా. ఆ బాధ నాకు బాగా అర్థ మవుతుంది. దానిని తలుచుకుని వెలవెల పోతున్నాను. క్రితం రాత్రి నా దగ్గరగా కూర్చొని ఆ కెప్టెన్ చనిపోయిన తన కుమార్తెను గూర్చి ఇలా అన్నాడు :

"ఆమె ఎక్కడకో యాత్రకు వెళ్ళిందనీ, మళ్ళీ తిరిగి వస్తుందనీ, ఆమెను తప్పకుండా ఒకసారి చూసే అవకాశం నాకు కలిగి తీరుతుందని అనుకుంటూ ఉంటాను. బహుశః ఆమె ఇంగ్లాండులో ఉందేమో ననిపిస్తుంది ఒక్కసారి. ఈ విషయం విని నువ్వు నవ్వుకుంటావేమోను. కాని అతడు చివరిరోజు వరకూ వెతుక్కుంటూ దిగంతాలచుట్టూ తిరుగున్నాడు తల్లీ!

కెప్టెన్ అల్వార్డోపై కవలలకు మంచి భక్తి విశ్వాసా లుండేవి. వారు అతనికోసం కొంతకాలంపాటు పనిచేశారు. ఆడంబర వచనాలతో, ఆత్మస్తుతి పరనిందలతో కాలం వెళ్ళబుచ్చుకుంటూన్న ప్రపంచంలో వారు ముగ్గురూ నిశ్శబ్దంగా పనిజేసుకుపోవటం శుభసూచనగా ఉండేది. ఇప్పుడు కుజుకోలో ఎస్టబాన్ భోజనం చేస్తూన్న వంట యింట్లోకి వచ్చాడు కెప్టెన్. ఎస్టబాన్ కుర్చీని కొంచెం చాటుకు లాగాడు. కాని కెప్టెన్ రాక అతనికి కొంత ఆనందా న్నిచ్చింది. అతడ్ని గుర్తుపట్టినట్లు కెప్టెన్ ప్రవర్తించ లేదు. అతని భోజనం పూర్తి అయేదాకా ఊరుకున్నాడు. కాని ఎస్టబాన్ భోజనం ముగించినతర్వాత - యింకా చాటుకు పోవటానికి ప్రయత్నించడం చూసి కెప్టెన్ ముందుకు వెళ్ళి "నువ్వు ఎస్టబాన్‌వా? మాన్యుయేల్‌వా? ఇదివరలో ఓసారి మీరు నాకు సామాన్లు దించడంలో సహాయం చేశారు. నేను కెప్టెన్ అల్వార్డోను" అన్నాడు.

"ఔను" అన్నాడు ఎస్టబాన్.

"కులాసాగా ఉన్నావా?"

ఎస్టబాన్ ఏదో గొణుక్కున్నాడు.

"నేను చేయబోయే యాత్రలో నావెంట రావడానికి ఒక దృఢమైన మనిషి కావాలి."

కాసేపు నిశ్శబ్దం...

"నువ్వు వస్తావా?"

మరికొంతసేపు నిశ్శబ్దం.

"ఇంగ్లాండు—తరువాత రష్యా వెళ్ళాలి. కష్టపడి పని చెయ్యవచ్చు. పుష్కలంగా కూలి దొరుకుతుంది. పెరూకి ఎంతో దూరం వెళ్ళవచ్చును. బావుందా ?"

ఎస్టబాన్ యీ మాటలు వింటున్నట్లు లేదు. మేజా బల్ల కేసి శూన్యంగా చూస్తూకూర్చున్నాడు. చివరకు కెప్టెన్ చెవిటివాడికి చెప్పినట్లు – పెద్ద కంఠస్వరంతో "నాతో పాటు ప్రయాణం చేస్తావా అని అడుగుతున్నాను" అన్నాడు.

"ఆఁ! వస్తాను" అన్నాడు ఆకస్మికంగా ఎస్టబాన్.

"బాగుంది ! చాలా బాగుంది ! నిజానికి నీ సోదరుడు కూడా వస్తే యింకా బాగుంటుంది."

"రాడు"

"ఏం ? ఎందుకని ! అతను రావటం యిష్టం లేదా ?"

ఎస్టబాన్ ఏదో గొణుక్కుంటున్నాడు. కొంచెం సేపయ్యాక లేస్తూ "నేనిప్పుడు వెళ్లాలి. ఒక మనిషిని చూడాలి–ఒకచోట" అన్నాడు అస్పష్టంగా.

"నీ సోదరుణ్ణి నేనుకూడా చూడనీ"

"చచ్చిపోయాడు" అన్నాడు ఎస్టబాన్.

"నువ్వింతకీ ఎవరివి ? నీ పేరేమిటి ?"

"ఎస్టబాన్."

"మాన్యుయేల్ ఎప్పుడు చనిపోయాడు ?"

"ఆఁ! ఏదీ... కొద్ది వారాలయింది. ఆతడు మోకాలిని దేనికో కొట్టుకున్నాడు. అంతే... కొన్ని వారాలయింది"

ఇద్దరూ అవనత వదనులై క్రిందకు చూస్తున్నారు.

"నీ కెన్నేళ్ళు...ఎస్టబాన్ ?"

"ఇరవయిరెండు."

"సరే! అలాగయితే నువ్వు నాతో రావటానికి నిశ్చయించినట్లే కదూ ?"

"ఆ."

"చలి నీకు పడదేమో ?"

"ఆ, పడుతుంది. నే నిప్పుడొక చోటుకు వెళ్ళి ఎవరినో చూడాలి."

"అలాగే! ఎస్టబాన్, భోజనానికి యిక్కడికేరా! మన ప్రయాణం గురించి చాలా మాట్లాడుకోవాలి. వచ్చి నాతో కొంచెం ద్రాక్షరసం త్రాగుదువుగాని. వస్తావు కదూ ?!"

"ఆఁ! వస్తాను."

"భగవంతుడు మేలుచేయుగాక !"

"భగవంతుడు మేలు చేయుగాక !"

ఆనాడు యిద్దరూకలసి భోజనం చేశారు. ఆ మరు నాడు ముందుగా లీమా వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. కెప్టెన్ అతనిచేత బాగా త్రాగించాడు. ముందు నిశ్శబ్దంగా వారు త్రాగటం మొదలుపెట్టారు. ఆ తరువాత కెప్టెన్ ఓడలను గురించీ, అవి ప్రయాణంచేసే మార్గాలను గురించీ మాట్లాడటం ప్రారంభించాడు. కొంచెంసేపయ్యాక ఎస్టబాన్

ఏవేవో విషయాలనుగురించి, చాలా చిరాగ్గా మాట్లాడ సాగాడు.

"ఓడలో నాకేదైనా పనిచూపించాలి నువ్వు. నేను ఏపనైనా - ఏదైనాసరే చెయ్యగలను. పై కెగబ్రాకి తాళ్లు కట్టగలను. రాత్రి తెల్లవార్లూ ఓడనుచూస్తూ కూర్చోగలను. ఎలాగూ నాకు రాత్రిళ్ళు నిద్రపట్టదని తెలుసుగా! అది సరేగాని, కెప్టెన్! నువ్వు నన్నెరుగనట్లుగా సంచరించాలి. ద్వేషిస్తున్నట్లుగా నటించాలి. ఈవిధంగా నువ్వు నాకు ఎన్నో పనులు అప్పగించవచ్చును. ఒక బల్లముందు కూర్చొని వ్రాయడం యింక నా వల్లగానిపని! అన్నింటికన్న ముఖ్య మయిన మరోవిషయం ఏమిటంటే - నాగురించి ఎవ్వరికీ - ఏమీ చెప్పవద్దు. అదే - దాన్నిగురించి..."

"నువ్వు మండుతూన్న ఇంట్లో చొరబడి ఎవరినో బయటకు లాగి రక్షించావని విన్నాను, నిజమేనా ఎస్టబాన్?"

"ఔను! నేను కాలిపోలేదు. అలాంటిదేమీ జరగ లేదు. ప్రాణం తీసుకుంటానికి కూడా అధికారం లేక పోయింది! ఆ విషయం నీకు తెలుసును. అందరికీ తెలుసు. కానీ, ఎవరినన్నా రక్షించటానికి తగలబడుతూన్న ఇంట్లోకి పోతే, అది నిన్ను నువ్వు చంపుకోవడం కాదుగదా! నువ్వు వస్తాదుపై ఎద్దుతో కుస్తీపట్టి చచ్చిపోతే - అది నిన్ను నువ్వు చంపుకుంటంకాదు. నీ అంతట నువ్వు కావా లని ఎద్దుముందు పడకూడదు. ఎటువంటి పరిస్థితిలోనూ జంతువులు ఆత్మహత్య చేసుకోవని నీకు తెలుసా? అవి

ఎప్పుడూ, ప్రాణాలు తీసుకోవాలని నీటిలో దూకవు. గుర్రాలు ఒకోసారి నిప్పుల్లోకి దూకుతా యంటారు ... నిజమేనా!"

"అబద్ధం! అది నిజమని నే ననుకోను."

"నేనూ నిజమనుకోవడంలేదు. మనకు ఒకా నొక ప్పుడు ఒక కుక్క ఉండేది. పోనీ, ఆ విషయం యిప్పుడు మాట్లాడకూడదు. అది సరేగాని కెప్టెన్, నీకు మేడ్రి మేరియా డెల్ పిలార్ను తెలుసునా?"

"తెలుసును"

"నేను వెళ్ళిపోయేముందు ఆమె కొక బహుమానం యిచ్చి మరీ పోదా మనుకుంటున్నాను. కెప్టెన్ అల్వార్డో! నేను చెయ్యబోయే కూలీకి రావలసిన డబ్బు అంతా ఒక్క సారి యిప్పుడే యివ్వాలి. తక్షణం ఆమెకొక బహుమతిని నేను కొని యిచ్చిరావాలి. ఆ బహుమతి నా ఒక్కడి తరఫునే కాదు—ఆమె......" ఇక్కడ ఎస్టబాన్ తన సోద రుని పేరు చెబుదా మనుకున్నాడు. కాని చెప్పలేకపోయాడు. దానికి బదులు మెల్లగా "ఆమె చాలా దయా ... ఆమెకు చాలా తీవ్రమైన నష్టం కల్గింది. ఒకసారి ఆమె అలాగే అంది. ఆమె ఎవరిని గురించి అన్నదో నాకు తెలియదు. కాని ఆమెకు నేనొక బహుమతిని యివ్వదలచుకొన్నాను. ఆ విషయాలు మనం భరించినట్లు స్త్రీలు భరించలేరు."

తెల్లవారగానే, ఏదో ఒకటి ఏరి కొందామని కెప్టెన్ వాగ్దానం చేశాడు. ఈ విషయం గురించే ఎస్టబాన్ చాలా సేపు మాట్లాడాడు.

మర్నాటి ఉదయం మెట్లదగ్గర అతను నిలబడి ఉండగా, ఎస్టబాన్ కన్పించాడు.

"మనం బయలుదేరాలి. నువ్వు సిద్ధం కా."

ఎస్టబాన్ కళ్ళల్లోకి ఆ వింత మెరుపు మళ్ళీ వచ్చింది.

"రాను. నేను నీతో రావటంలేదు."

"ఓ! వస్తానని మాట యిచ్చావుగా నిన్న?"

"ఇది బొత్తిగా అసాధ్యం - నీతో నేను రాలేను." అంటూ వెనక్కి తిరిగాడు ఎస్టబాన్.

"ఒక్కక్షణం ఆగు ఎస్టబాన్! ఒక్క నిముషం యిలా రా."

"నేను నీతో రాలేను. నేను పెరూను వదిలిపెట్టలేను."

"నేను నీకొక ముఖ్యవిషయం చెప్పాలి."

ఎస్టబాన్ మెట్లు దిగి క్రిందకు వచ్చాడు.

"మేడ్రి మేరియాడెల్ పిలార్ కు, నువ్వు యివ్వదలచుకొన్న బహుమానంమాట ఏమిటి?" అన్నాడు మెల్లగా కెప్టెన్. ఎస్టబాన్ దూరంగానున్న కొండలకేసి చూస్తూ జవాబు చెప్పలేదు. "ఆమెకు బహుమానం ఇవ్వకుండా ఉండటానికి వీలులేదు. ఆమెచాలా బాధపడుతుంది. నీకు తెలుసా?" అన్నాడు కెప్టెన్ మళ్ళీ.

"సరే" అంటూ ఆ మాట కొంచెం నచ్చినట్లుగా గొణిగాడు ఎస్టబాన్.

"సముద్రాలు దాటిపోతే, పెరూలో కంటే బావుంటుంది. లీమా - కుజ్కో - ఈగోడ్లు- అన్నీ నీకు తెలుసు,

వీటినిగురించి యింకా నువ్వు తెలుసుకోవలసింది ఏమీ లేదు. ఇప్పుడు నీకు కావల్సింది సముద్రం - ఎప్పుడూ సముద్రంమీద ఉండడమే కాదు. నీకు ప్రొద్దుపోవటానికి చేతినిండా పని దొరుకుతుంది. ఆ విషయమంతా నేను చూసుకుంటాను. వెళ్ళు - నీ సామాన్లు అవీ సిద్ధంచేసికో! మనమింక బయల్దేరాలి.”

ఎస్టబాన్ ఏదో ఒకటి నిశ్చయం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతవరకు ఏవిషయంలోనైనాసరే మాన్యుయేల్ నిర్ణయాలు చేసేవాడు. కాని మాన్యుయేల్‌కుకూడా ఇంతటి పెద్ద నిర్ణయాలు చేయాల్సిన అవుసరం కలుగలేదు. ఎస్టబాన్ నెమ్మదిగా మేడమీదకు నడిచాడు. కెప్టెన్ అతని కోసం నిరీక్షిస్తూ క్రింద కూర్చున్నాడు... ఎంతోసేపు అతనలా కూర్చున్నాడు. ఎస్టబాన్ తిరిగి రాలేదు. చివరకు ధైర్యంచేసి, పైకి వెళ్ళడానికి సాహసించాడు కెప్టెన్. సగం దూరం వెళ్ళి ఆలకించాడు. మొదట ఏ శబ్దమూ వినిపించ లేదు. ఎస్టబాన్ ఒక దూలానికి ఒక త్రాటిని వ్రేలాడ కడుతున్నాడు. కెప్టెన్ వణికిపోతూ మెట్లమీద నుంచొని “అదే మంచిది! అతనికి నేను అడ్డం వెళ్ళగూడదు. అతనికి సాధ్యమైంది ఆపని ఒక్కటేనేమో” అనుకున్నాడు. ఆ తరువాత మరొక శబ్దం విని కెప్టెన్ గదిలోకి దూకి ఎస్టబాన్‌ను పట్టుకున్నాడు.

“వెళ్ళిపో! నన్ను నా మానాన్ని ఉండనీ! నాదగ్గరకు యిప్పుడు రావద్దు” అంటూ కేకలు పెడుతున్నాడు ఎస్టబాన్.

ఎస్టబాన్ బోర్లగా క్రిందపడి "నేను ఒంటరివాణ్ణి! ఒంటరివాణ్ణి! ఒంటరివాణ్ణి!" అంటూ అనుస్తున్నాడు. అక్కడే నిలబడిన కెప్టెన్ విశాలవదనం, దుర్భర విషాద భారంతో కందిపోయింది. తన జీవితంలోనూ ఇటువంటి ఘట్టమే జరిగింది. దాన్నే మననంచేశాడు.

క్రింద పడిఉన్న దురదృష్టవంతుడు వింటున్నాడనే సమ్మకం లేకపోయినా, "మనం చేయగలిగినదంతా మనం చేద్దాం ఎస్టబాన్. ఓపిక ఉన్నంతవరకు ముందుకు నడుద్దాం. ఈ పరిస్థితి ఎంతో కాలం కొనసాగదు. నీకా విషయం తెలుసు. కాలప్రవాహం కదలిపోతూనే వుంటుంది. అది పోయే మార్గాన్ని చూసి, నువ్వే ఆశ్చర్యపడతావు" అన్నాడు కెప్టెన్.

వాళ్లు లీమా బయలుదేరారు. శాన్‌లూయీరే వంతెనదగ్గరకు వచ్చేసరికి, కొన్ని వర్తకపు సరుకులను సురక్షితంగా ఆవలకు చేర్పించడానికి, కెప్టెన్ క్రిందకు దిగాడు. కాని ఎస్టబాన్ వంతెన దాటుతూ క్రింద పడిపోయాడు.

## పియెరో పరామ - డాన్ జైమ్.

మార్క్వెసా డిమాండిమేయర్ ఒకానొక ఉత్తరంలో (29 పది) పియోమామపై గల అభిప్రాయాన్ని వర్ణించటానికి ప్రయత్నించింది.

ఆమె తన కుమార్తెకు యిలా ఉత్తరం వ్రాసింది:

"నీకు పాదరక్షలు తయారుచేస్తూ ఉదయమంతా యీ వరండాలో కూర్చొని గడిపానమ్మా. కాని మనస్సు ఎందులకోగాని ఆ పనిమీద లగ్నం కావడం లేదు. పరిపరి విధాల పోతూంది. ఇప్పుడు నేను ఎదురుగా గోడమీద సాగిపోతూన్న చీమలబారును చూస్తున్నాను. ఆ చీమలు కన్నాలు పెట్టుకుంటూ, అత్యంత సహనంతో, నా యింటిని గుల్లచేస్తున్నాయి. క్షణక్షణం ఒక చీమ కొండెంతో ఏదో తీసుకవచ్చి వదలి, నావైపొకసారి చూసి చిత్రంగా నడుము కదలించి, వెనక్కు తిరిగి వెళ్ళిపోతున్నది. దానికి వెనుకే అనేక చీమలు ప్రాక్కుంటూ వస్తున్నాయి. కొన్ని ఏవో వార్తలు చేరవేసుకు పోతున్నాయి. అందులో త్వరితంగా వార్త లందించవలసిన సేవకులు, అడ్డం వచ్చిన వాటిని నెట్టుకుంటూ కోపంగా పరిగెత్తుతున్నాయి. నాకు యిది చూస్తూంటే పియోమామ గుర్తుకు వస్తున్నాడు. ఎందుకో తెలుసా? ఇదే భంగిమలో అతడు త్రోవనుబోయే విరాగినో, కొలువులోని ఉద్యోగినో ఆపి, ఏదో చెవులో

ఊదుతూ ఉంటాడు. ఒకరోజు మధ్యాహ్నం అత డిలా తిరుగుతుంటే చూశాను. పనీ పాటూ మరొకటి లేదుగనుక- ఆ చీమలకు వెయ్యడానికి ఏదన్నా తినుబండారాన్ని తెమ్మని పెపీటాకు చెప్పాను.

"అదేవిధంగా సూర్యాస్తమయం కాకముందే — పియోమామా వస్తే పంపవలసినదిగా 'కేఫ్ పిజారో'కు కబురు పెట్టాను. అతనికి ఏదో ఒక బహుమతినిచ్చి - ఇప్పుడు వాడ వాడల్లోనూ మారుమ్రోగి పోతున్న చక్కటి పాటను సంపాదిస్తాను. తల్లీ లోకంలో ఉత్తమమైనవన్నీ నీకు కావాలి."

తరువాతి ఉత్తరంలో యిలా ఉంది. "అమ్మా! పియోమా మంతటి ఆహ్లాదకరమైన వ్యక్తి ఈ లోకంలో మరొకడు కన్పించడు. ఈ విషయంలో నీ భర్త తరువాత యితణ్ణే చెప్పాలి. ఎంతో కులాసాగా మాట్లాడుతాడు. అతడికి యిప్పుడున్న చెడ్డపేరే లేకపోతే నా కార్యదర్శిగా చేసుకొనేదాన్ని. అప్పుడతడు నాకు ఉత్తరాలు వ్రాసేవాడు. తరువాత అనేక తరాలవారు నాలోగల చమత్కార ధోరణిని వేలెత్తి చూపేవారు. కాని దుస్సాంగత్యాలవల్ల, దుర్వ్యసనాలవల్ల అతడు పూర్తిగా పాడయిపోయాడు. అందువల్లనే అతనిమానాన్ని అతని వదలిపెట్టవలసివచ్చింది. అతని జీవితం చాలా నికృష్టమైనది. ఈ పృథ్విలోని నీటి నంతటినీ తెచ్చి కడిగినా ఆ పాప పంకిలం అతన్ని వదలిపోదు. కాని అతను మాట్లాడేభాష ఎంత దివ్యమైనది! అతడుచెప్పే విషయాలు ఎంత అద్భుతమైనవి. కూపస్థ మండూకంలా, ప్రదర్శనశాలకు మాత్రమే పరిమితమైన జీవితాలు అలాగే

ఉంటాయి మరి. పాపం! యిటువంటి జీవిపట్ల ప్రపంచం ఎందుకంత చెడ్డగా ప్రవర్తిస్తుంది! తన లేగనూడకు దూర మైనగోమాత విషాదభారమంతా గూడుకట్టి అతని కండ్లలో నిండినట్లు అనిపిస్తుంది."

కెమిాలా పెరికోల్‌కు యీ పియోమామా ఒక పరిచారకుడుగా పనిచేశాడన్న విషయం ముందు మనం తెలుసుకోవాలి. సంగీతం నేర్పిన ఉపాధ్యాయుడుగా, సేవకుడుగా ఆమె ధనాన్ని భద్రపరిచే ధనాగారంగా - యిలా అనేకవిధాలుగా అతనికీ ఆమెకు సంబంధంఉంది. ఉదాహరణకు ఆమె తన పాత్రలను ఎలా నటించాలో అతడు తర్ఫీదు యిస్తాడు. కెమిాలాకు వ్రాయడం చదవడం వచ్చునని ఊళ్ళో పుకారుగా ఉన్నా, ఆమెకు యెప్పుడూ పియోమామే చదివి పెట్టడం, వ్రాసిపెట్టడం జరుగుతూంది. అనువైన కాలంలో వాళ్లు వారానికి రెండుమూడు నాటకాలు వేస్తూంటారు. ప్రతి నాటకంలోనూ పెరికోల్‌కు ముఖ్యమైన పాత్రలు ఉంటూనే వుంటాయి. అటువంటి సుదీర్ఘమైన సంభాషణలు వల్లెవేయడం అతి సులభమైన పనిగాదు.

ఈ అయిదు శతాబ్దాలలో పెరూలో ఒక రకమైన పునరుజ్జీవనం కలిగింది. సంగీత నాట్యకళలందు అత్యంత శ్రద్ధాసక్తులు కన్పిస్తున్నాయి. ఉదయం వేళలందు థామస్ లూయిూస్ డావిటోరియా ప్రార్థనలు, సాయంవేళ కాల్డెరన్ కవిత్వమూ వింటూ లీమావాసులు పండుగలు చేసుకుంటున్నారు. ఈ ప్రదర్శన శాలలోనే కెమిాలా పెరికోల్ క్రమంగా పేరు ప్రఖ్యాతులను సంపాదించుకుంది. కొన్ని

కొన్ని నాటకాలు నాలుగైదుసార్లు వెయ్యడంగూడా వరి పాటి. 17 వ శతాబ్దపు స్పానిష్ నాటకాన్ని ప్రదర్శించ డానికి కావలసిన సరంజామా నంతా నిర్వాహకుడు సిద్ధం చేసేవాడు. లోప్‌డివాగాకు చెందినవే వంద నాటకాలకు పైన ఆమె ప్రదర్శించింది. ఈ కాలంలో లీమాలో అనేక మంది అద్భుతమైన నటీమణు లున్నారు. కాని ఈమెను మించినవారు మాత్రం లేరు. స్పెయిన్ ప్రపంచంలోనే ఆమెను మించినది లేదు. మాడ్రిడ్ నటీమణులను గురించి యిక్కడ చాలామంది కలలుకంటూ ఉంటారు. కానీ నటన విషయంలో వారు కూడా పెరికోల్‌కు సరిపోరు. పెరికోల్ యింతటి గొప్ప నటియని గ్రహించిన వ్యక్తి ఒక్క పియో మామ మాత్రమే.

పియోమామ కాస్టీలియన్ కుటుంబానికి చెందిన వాడు. పది సంవత్సరాల వయస్సులో, అతడు యింట్లోంచి పారిపోయి మాడ్రిడ్ చేరుకున్నాడు. ఆనాటినుంచి అతడు స్వశక్తిమీదనే జీవితం నడుపుతున్నాడు. సాహసికునకు కావల్సిన లక్షణాలన్నీ అతనిలో మూర్తీభవించాయి. ఒక సారి చూచిన ముఖాలను, పేర్లను అతడెన్నడూ మరచిపోయే వాడుకాడు. తన వేషభాషలను అనేక విధాలుగా మార్చి, అవతారములు ధరించగల ఘనుడు. అద్భుత విషయాలను సృష్టించడం, అతి నిగూఢ రహస్యాలను పోషించటం, అపరిచితుల నైననూ, అనతి కాలంలోనే ఆత్మీయులను చేసి కోవడం, మొదలైన గుణగణాలన్నీ అతనికి పుష్కలంగా ఉన్నాయి. పదిహేను సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ

వర్తకులకు కరపత్రాలు పంచిపెడుతూ అతడు జీవించాడు. మరికొన్ని రోజులు గుఱ్ఱాలను పెంచాడు. ఇంక కొన్ని రోజులు రహస్యవ్యాపారాలలో తిరిగాడు. పదిహేను ఇరవై సంవత్సరాల వయస్సు మధ్య సర్కస్ కంపెనీలకు కావలసిన పాములను, ఎలుగుబంట్లను మచ్చిక చేసేవాడు. కొన్నాళ్ళు వంటపని చేసేవాడు. కొన్నాళ్ళు విదూషకు డయ్యాడు. మరికొన్నినాళ్లు రహస్య సమాచారా లందించేవాడు. ఈ పట్టణంలోని అన్ని ప్రదర్శన శాలలతోనూ అతనికిసంబంధం ఉంది. పెద్ద అపవాదులను లేవదీయగల్గిన ప్రజ్ఞాశాలి. ధాన్యాల ధరవరల మార్పులు గురించి అవుసరమైన పుకార్లు పుట్టించి, ధన మార్జించిన ధీశాలి. ఇరవై ముప్ఫయిసంవత్సరాల మధ్య వయస్సులో పెద్ద హోదాలో గల వారందరూ అతనిని గుర్తించడం జరిగింది. కొండలలో రెచ్చుతున్న విప్లవ ధోరణిని అణచి రమ్మని ప్రభుత్వం అతడ్ని పంపించింది. అతని విషయనిర్ణయశక్తి అత్యద్భుతమైనది. అందుచేతనే ఆస్ట్రియన్లు అతనిసలహా తీసుకున్నారని తెలిసినప్పటికీ ఫ్రెంచివారుకూడా అతని సహాయ మపేక్షించడం జరిగింది. దొడ్డిదోవ నైనప్పటికి అనేకసార్లు అతడు జెస్యుర్సిన్ రాకుమార్తె దగ్గరకువచ్చి సుదీర్ఘ సంభాషణలు సాగించిపోవడం జరుగుతూండేది.

ఎటువంటి లాభాలు వస్తూన్న నౌఖరీ అయినప్పటికీ రెండువారాలకు మించి చేసేవాడుకాదు. కాకపోతే నాతడొక సర్కస్ కంపెనీ నిర్వాహకుడు; ఒక ప్రదర్శనశాలకు దర్శకుడు, గొప్ప వర్తకుడు, రాజాంతఃపురాల్లో కార్యదర్శి

కావలసినవ్యక్తి. కానీ యెటువంటిదాన్నైనా సొంతం చేసి కొనడం, బంధాలకు లొంగిపోవడం, చిరకాలం ఒకే దాన్నంటి పెట్టుకొని ఉండటం మొదలైన విషయాలు అతని స్వభావంలో లేవు. అతని నుదుటిరాత అలాంటిది. దీని ఫలితంగానే అతడు దొంగతనాన్నికూడా మాను కున్నాడు... అసలు అత డనేకసార్లు దొంగతనాలు చేశాడు. అయితే అతడికి వృత్తిలో తగినంత అనుకూల వాతా వరణం లభ్యమవలేదు. ప్రపంచంలోని రక్షక భటులందరి కండ్లు కప్పి తప్పించుకు పోగల నేర్పు అతనిలో ఉంది.

పియోమామకు ఇరవై సంవత్సరాల వయస్సు వచ్చే సరికే– తన జీవితానికి మూడు ఆదర్శాలున్నాయని గ్రహిం చాడు. మొదటిది స్వేచ్ఛ; ఇందు నిరంతరం మార్పు కావాలనే వాంఛ. ఒకరకమైన నిగూఢత్వము; దానితో బాటు సర్వజ్ఞత కలిసి వున్నాయి. సాంఘికపు విలువలను పరిత్యజించటానికి అతడు సిద్ధంగానున్నాడు. ఎదుటనున్న వ్యక్తులకు తెలియకుండానే వారి జీవితాలకు సంబంధించిన నిగూఢ రహస్యాలను సేకరించడం, దూరంగాఉండి వారిని పరిశీలించడం, సందర్భోచితంగా తన పరిజ్ఞానాన్ని ప్రయో గించి – వ్యక్తులకు ప్రభుత్వానికి కొన్ని కొన్ని పనులు చేసి పెట్టడం జరుగుతూండేది. అతని ఆదర్శాలలో రెండవది: సౌందర్యమూర్తియైన ఓ స్త్రీ సమక్షంలో తన జీవితంలోని అత్యధికభాగాన్ని గడపడం – ఆరాధ్య దేవతగా ఆమెను పూజించడమూను. ఊపిరి పీల్చడం ఏ ప్రాణికైనా యెంత అవసరమో – అటువంటి స్త్రీ సమక్షంలో జీవించడమనేది

అతడికి అంత అవుసరమనవచ్చును. ఈ సౌందర్యారాధనకు ఆ ప్రదర్శన శాలల్లోనూ, విలాస భవనాలలోనూ, యింకా కొలువులోనూ ఉన్న స్త్రీలందరూ అర్హులే. కాని వారిలో కొంద రీతడ్ని గేలిచేసేవారు; మరికొందరు హింసించేవారు-యింకా కొంతమంది అవమానించేవారుకూడా. వారి కోప తాపాలు, ఆవేశాలు, దుఃఖాలు అన్నీ యీత డనుభవించిన వాడు. అతడు కోరినదల్లా ఒక్కటే... విశ్వాస పాత్రమైన పెంపుడు కుక్కను చూచినట్లు తనను వారు చూస్తే చాలు! వారి గదుల్లోకి తాను యధేచ్ఛగా తిరిగే చనువిస్తే చాలు. తాను వారికి లేఖలు వ్రాసిపెడతాడు. ఎటువంటి పనైనా సరే చేసిపెడతాడు. స్త్రీ హృదయాన్ని, మనస్సును గ్రహించాలని అతడు నిరంతరం తపించేవాడు. వారు తనను ప్రేమించగలరని తా నెన్నడూ భావించి యుండలేదు. తత్ఫలితంగా నీతడు నగరంలోని మారుమూాల సందుల్లోకి - నీచాతి నీచమైన తావుల్లోకి తన డబ్బును తరలించుకు పోయేవాడు. దుబ్బులా పెరిగిన గడ్డంతో, విషాదపూరిత నయనాలతో - నిస్పృహా మూర్తీభవించిన ట్లుండేవాడు. ఈ మురికి ప్రాంతాలే అతనికి దేవాలయాలయ్యాయి. ఆ మురికి పేటల్లో జీవిస్తున్నప్పుడే - 'పియోమామ' అనే పేరు సంపాదించుకొన్నాడు. వారు కష్టాల్లో నున్నప్పుడే పియోమామ వ్యక్తిత్వం బయటపడేది. ఆపదసమయాల్లో ఆర్థిక సహాయంచేసి ఆదుకునేవాడు. వారు వ్యాధిగ్రస్తులైతే పరిచర్యలు చేయడం, జరాభారంతోగాని, అనారోగ్యం వల్లగాని సౌందర్యాన్ని కోల్పోయిన స్త్రీలను ఒకనాటి

సౌందర్య చిహ్నాలుగా భావించి ఆదరించడం - వారు మర ణించినప్పుడు పరితప్త హృదయంతో దుఃఖించడం పియో మాముకు అలవాటుగా మారింది.

పియోమామ జీవితంలోని మూడవ ఆదర్శం: స్పానిష్ సాహిత్య ప్రియులందరికీ సన్నిహితంగా నుండటం; ఆ భాషలోని ఉత్తమ కళాఖండాలను; ముఖ్యంగా నాట కాలను ఆత్మీయంగా చేసుకోవడం - ఇందుకు కావలసిన సరంజామా నాతడు సంపాదించాడు. కాల్డెరన్ సర్వాన్టెస్లా అద్భుత పదప్రయోగ విన్యాసానికి ఆశ్చర్య పడలేని పండితు లను అత డెన్నడూ హర్షించేవాడు కాదు. అసలు తానే కవిత్వము వ్రాయాలని కలలుగనేవాడు. తాను వ్రాసిన వ్యంగ్య గీతాలు జనపదాలలో మారుమ్రోగుతున్న విషయం అతనికి తెలియదు.

వ్యభిచార గృహాలలో సహజంగా చెలరేగే పోట్లాటల వల్ల అతడి జీవితం చిక్కగా మారి చివరకు పేరూ చేరు కున్నాడు. యూరప్‌లోకంటే పెరూ వచ్చినతరువాత పియో మాము ఎక్కువ చపలచిత్తుడైనాడు. ఇక్కడకూడా అతడనేక వ్యాపార రంగాల్లో ప్రవేశించాడు. ఒకసారి ఒక చైనా దేశపు ఓడ కాన్టన్‌నుంచి అమెరికా వచ్చింది. అందులోని పింగాణీ సామానులన్నీ తీరంమీదకు చేర్చి - పియోమామ వాటిని క్షణంలో విక్రయం చేశాడు. ఇంకాస్ చిట్కా వైద్యంలోని రహస్యాలను ఆకళించుకొని ఔషధాలను తయారుచేశాడు. ఈ విధంగా నాల్గునెలలు తిరిగేలోపున లీమాలోని ప్రతి వ్యక్తితోను అతనికి పరిచయం ఏర్పడింది.

ఇంతేకాదు, సముద్రతీరానగల అనేక పట్టణాల్లోనూ. గను ల్లోనూ పనిచేసే అనేకమంది వ్యక్తులతో అతడు పరిచయం సంపాదించాడు. తాను సర్వజ్ఞుడని అందరూ విశ్వసించేటట్లు ప్రవర్తించాడు. తుదకు వైస్రాయికూడా పియోమామా సర్వతోముఖ ప్రజ్ఞనుగుర్తించి అనేక ముఖ్యమయిన వ్యవహారాల్లో అతడ్ని ఉపయోగించుకున్నాడు. డాన్ ఆంద్రెస్ బుద్ధి ఎంత మందగించినా ఒక సుగుణంమాత్రం అతనిలో జీవించి వుంది. రహస్య కార్యక్రమాలను నిర్వహించే సేవకులను ఎలా అదుపులో పెట్టాలో అతనికి బాగా తెలుసును. అందువల్లనే పియోమామాను అతినైపుణ్యంగా అత డుపయోగించుకున్నాడు. అతడ్ని యెటువంటి పనులకు ఉపయోగించుకోవాలి, యెటువంటివాటికి కూడదో అతడు గ్రహించి ప్రవర్తించేవాడు. అంతేగాదు పియోమామాకు ఉద్యోగాలు మారుతుండాలనే విషయంకూడా అతనికి తెలుసు. అనేక రాత్రులు, పియోమామా అంతః పురంలో ప్రవేశించి వైస్రాయితో కాలక్షేపం చేసేవాడు.

ఇంత జరిగినప్పటికీ పియోమామా ధనవంతుడు మాత్రం కాలేదు. ఏపని చేస్తున్నా, తాను అభివృద్ధిలోకి వచ్చే సూచనలు కనిపించగానే, ఆ పని వదలి చేతులు దులుపుకునేవాడు. అతడికి ఒక యిల్లువుంది. ఆ విషయం మాత్రం ఎవరికీ తెలియదు. ఆ యిల్లు కుక్కలతో నిండిపోయి ఉంటుంది. పై అంతస్తులు పక్షులకు ప్రత్యేకంగా కేటాయించబడ్డాయి. ఆ రాజ్యాని కాతడు అధిపతి అయినప్పటికీ, ఒంటరితనం అతడ్ని విడిచిపెట్టలేదు. ఆ ఒంటరి

తనంలో కూడా ఏదో ఔన్నత్యం ఉన్నట్లు కనిపిస్తుంది. చివరి కాతడొక ఘనకార్యానికి ఉపక్రమించడం-అందులో యితరుల జీవితరహస్యాలను పరిశీలించడం, సౌందర్యమూర్తులైన స్త్రీలను, స్పానిష్ సాహిత్యాన్ని ఆరాధించడం- అనే అతని మూడు జీవితాదర్శాలకూ అవకాశం లభించింది. కెమిలా పెరికోల్ అతడలా సృష్టించిన వ్యక్తి. ఆమె అసలు పేరు మైకేయిలా విలేగాస్. పది, పన్నెండేండ్ల వయస్సులో, వీధులవెంట పాడుకుంటూ ఆమె తిరుగాడేది. ఆ స్థితిలో యీ దీనబాలికను పియోమామ చూడటం తటస్థించింది. ఆమె గొప్ప గాయకులను అనుకరిస్తూ, పాటలు పాడటం అతడు విని ఆమెను కొన్నాడు. అలా వీధుల్లో తిరుగాడుతూ, ఏ చెట్టు నీడనో నిద్రించవలసిన అనాథ బాలికకు ఒక ఆశ్రయమంటూ లభించింది. ఆమెకు కావలసిన పాటలను పియోమామ స్వయంగా వ్రాసేవాడు. గళమెత్తి పాడటానికి కావలసిన మెళుకువలన్నీ బోధించాడు. ఆమెకు కొత్త దుస్తులను కొనిపెట్టాడు. తనకు కొరడా దెబ్బలు తప్పవనుకున్న ఆ బాలికకు పియోమామ వైఖరి ఆశ్చర్యకరంగా కన్పించింది. కాని ఈవిషయంలో పియోమామ యింకా దిగ్భ్రాంతుడవవలసి వచ్చింది. ఎన్నడూ కలగనంతటి అభివృద్ధిని, అనతికాలంలో ఆ అనాథ బాలిక సాధిస్తున్నది! నిశ్శబ్దంగా, భారంగా ఉండే ఆ పన్నెండేండ్ల పసిపిల్ల కళ్ళలో చైతన్యం తొంగి చూస్తున్నది. నటనలోనూ, అనుకరణలందునూ, ప్రావీణ్యం సంపాదించాలని పియోమామ ఆమెచేత నిర్విరామ సాధన చేయించసాగాడు.

ఆమెను తరచు ప్రదర్శన శాలలకు తీసుకొనిపోయి, రంగస్థల పరిజ్ఞానం కల్గించడానికి ప్రయత్నించాడు. కాని కెమీలా పెరికోల్, ఒక స్త్రీగా పియొమోమాకు పెద్ద అఘాతం కల్గించింది. చివరకు ఆమె అవయవాలన్నీ పరిపూర్ణ స్వరూపం పొంది వికసించాయి. భారంతో, ఆకలితో అలమటించి క్రుంగిపోయే ఆ దీనవదనం – సౌందర్యాన్ని కప్పుకున్నది. ఆమెస్వభావం కూడా స్వరూపంతో బాటు అత్యద్భుతంగా మారిపోయింది. సౌకుమార్యం, సంస్కారం, వివేకం ఆమెలో వికసిస్తున్నాయి. కాని ఇవన్నీ అతనికి వ్యతిరేకంగానే పరిణమించాయి. అతనిలో కెమీలాకు ఏలోపమూ కనిపించ లేదు. అతనంటే ఆమెకు భక్తిశ్రద్ధ లున్నాయి. వారు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్నారు. కాని ఆప్రేమలో మోహానికి తావులేదు. ఆమెలోని ప్రతివంపు, ప్రతిసొంపు–అఖయుకు ఆమె క్రీడాకూడా, అతనికి ఆరాధ్య దైవతాలయ్యాయి. ఈ బంధంలో ఒకోసారి ఆర్ద్రమైన మోహం తొంగి చూడకపోవడం లేదు. వారు ఎంతో దూరం కలసి ప్రయాణం చేశారు. వారు మెక్సికోకూడా వెళ్ళారు. సముద్ర తీరాలపై నిదురించారు. పెనామాలో కొరడా దెబ్బలు తిన్నారు. పసిఫిక్ మహాసముద్రంలో ప్రయాణం చేస్తూ, ఓడ మునిగిపోగా, ఒకానొక ద్వీపంచేరి, ప్రాణాలు కాపాడుకున్నారు. విషకీటకాలను దాటుకుంటూ ఎన్నో అరణ్యాలలో ప్రయాణం చేశారు. కొన్ని సమయాల్లో–పొలాల్లో కూలీలుగా పనిచేశారు. ప్రపంచంలోని ఏ విషయమైనా వారిని ఆశ్చర్య చకితులను చెయ్య లేదు.

ఆ తరువాత పియోమాము, ఆమెకు యింకా కష్టతరమైన శిక్షణ యివ్వడం ప్రారంభించాడు. దొమ్మరి విద్య నేర్చుకొనే పద్ధతిలా ఉం దది. ఆమె చాకచక్యానికి అనతి కాలంలోనే పొగడ్తలు కుప్ప తెప్పలుగా వచ్చి మీాద పడ సాగాయి. ఈ పొగడ్తల వర్షం ఆమెలో సంతృప్తిని కలిగించి, యింకా అభివృద్ధి సాధించాలనే తృష్ణను ఆవిరి చేయవచ్చు. అందుచేత పియోమాము, ఆమెను కొట్టక పోయినా, అంత భయభ్రాంతులను కలుగజేసేవాడు.

ప్రదర్శనం అయిపోగానే, కెమీాలా దుస్తులు మార్చు కోవడానికి గదిలోకి వచ్చేది. ఒక మూలగా నిలబడి నిర్లిప్తంగా ఈల వేసుకుంటూన్న పియోమాము కనిపించేవాడు. ఆమె కోపంతో మండిపోతూ "ఏమిటది? మహానుభావుడా! మళ్ళీ యేమొచ్చింది" అంటూ అరచేది.

"ఏమీా లేదు! నా కెమీాలా! మరేం లేదు."

"నీకు యిష్టంగాని విషయం ఏదో ఉంది. ఏదోతప్పు వెదకందే నీకు నిద్రపట్టదు...ఏమిటది? ముందు చెప్పు?"

"ఓ నా సంధ్యతారా! ఏమీా లేదు."

తన కళానైపుణ్యం, తక్కువదన్న భావం, ఆమెను బాధపెట్టేది. ఆమె కళ్ళల్లో నీరు పొంగేది.

"నీ ముఖం చూడకుండావుంటే బాగుండేది. నాజీవితాన్నంతా విషతుల్యం చేస్తున్నావు. నేను చేసినదంతా తప్పు అని నీ అభిప్రాయం. అలా అనుకోవడమే నీకానందం- అలాగే కానీ."

పియోమామ యింకా ఈల వేస్తూనే ఉన్నాడు. "ఇవాళ నే నంతగా బావుండలేదని నాకు తెలుసును. ఆ విషయం నువ్వు వేరే చెప్ప నవుసరం లేదు. అదలావుంచు, ఇంకిప్పుడు నువ్వు వెళ్ళవచ్చును. నిన్ను యిక్కడ మళ్ళీ చూడదలచుకోలేదు."

ఒక్కసారి పియోమామ ముందుకు వంగి తీవ్రంగా "ఆ ఖైదీతో సంభాషణలు ఎందుకంత తొందరగా చెప్పావు?" అన్నాడు.

పెరికోల్ కళ్ళల్లోంచి యింకా నీరు పొంగి పొరలు తున్నది. "ఓ భగవంతుడా! నన్ను ప్రశాంతంగా మరణించనీ. ఒకరోజు తొందరగా చెప్పమనేదీ నువ్వే - మరో రోజు అలా చెప్పకూడ దనేదీ నువ్వే-ఐనా ఒకటి రెండేండ్లలో ఎలాగూ నేను వెర్రి దాన్నైపోతాను...! అప్పుడీ బాధే లేదు."

ఇంకా ఈల వేస్తూనే ఉన్నాడు. "ఎన్నడూ లేనంత యిడిగా యివాళ ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. నే చెప్పేది వింటున్నావా? ఎప్పుడూ యిలా జరగలేదు. తొందరగా చెప్పనీ, నెమ్మదిగా చెప్పనీ - వారికివేమీ పట్టలేదు. వాళ్ళు కంట తడిబెట్టారు. నేను దివ్యంగా కన్పించాను. నాకు కావల్సింది అదే - ఇంక మాట్లాడకు- మాట్లాడ నవుసరం లేదు."

అతను పూర్తిగా నిశ్శబ్దంగా ఉన్నాడు.

"నన్ను పెంచి పెద్దచేసింది నువ్వే! కాని మరోసారి ఇలాంటి మాటలంటే, యింక నేను సహించను. నువ్వు యింకో పిల్లను ఎన్నుకోవచ్చును."

ఆమె వెక్కి-వెక్కి ఏడుస్తూ, కంపిస్తున్న విషయాన్ని గమనించనట్లు నటిస్తూ, పియోమామ అనునయ పూర్వకంగా ఆమె కురులు నిమిరేవాడు. చివరకు ఆమె ఒక్క సారిగా వెనక్కి-తిరిగి, వెర్రిగా అతని చేతిని ముద్దాడి "పియో మామా! నిజం చెప్పు - నువ్వు మధ్యలో ప్రదర్శనశాల వదలి పెట్టవలసినంత అసహ్యంగా నే నున్నానా?"

కొంచెంసేపయ్యాక "ఓడమీద దృశ్యంలో నువ్వు బాగున్నావు" అనేవాడు.

"నేను యింకా బాగుండవలసిందే పియోమామా! కుజ్కో-నుంచి నువ్వు తిరిగివచ్చినరాత్రి నీకు గుర్తుందా?"

"చివరలో నువ్వు చాలా బాగా ఉన్నావు."

"నిజంగా!"

"కాని నువ్వు ఆ ఖైదీతో మాట్లాడిన ధోరణి ఏమిటి? చెప్పు?"

ఆ మాటనగానే పెరికోల్ బల్లమీద తలపెట్టుకొని, ముఖాన్ని కప్పుకొని, క్రుళ్ళిక్రుళ్ళి ఏడుస్తుంది. పరిపూర్ణత! పరిపూర్ణత మాత్రమే కావాలి. కాని అదెప్పుడూ రాదు.

ఆ తర్వాత పియోమామ, తగ్గించిన కంఠస్వరంతో, ఒక గంటసేపు మాట్లాడతాడు. కథాగమనం, భంగిమల తీరు, సంభాషణలధోరణి మొదలయిన విషయాలను గురించి

ప్రొద్దంగా వారు సూర్యోదయ మయ్యేవరకూ - అలా మాట్లాడుకుంటూనే ఉండేవారు.

ఎవరిని ఆనందింప జేయాలని వీరి తాపత్రయం? కేవలం ప్రేక్షకుల్ని మాత్రం కాదు. వారెప్పుడో ఆనందంతో సంతృప్తులయ్యారు. ఉత్తమోత్తమమై ఆశ్చర్యం కలిగించే కళాప్రపంచంలోనుండి మనం వచ్చాం. మళ్ళీ మనం వాటి నిక్కడ సాధించలేం. అవి ఛాయామాత్రంగా, అస్పష్టంగా మనకు గోచరిస్తాయి. మనం తిరిగి ఆ ప్రపంచానికే వెళ్ళి పోగలం. స్వర్గ వైభవంతో తులతూగే, అత్యుత్తమ ప్రద ర్శన శాలను సృష్టించాలని పెరికోల్, పిమోమాములు పరితపిస్తున్నారు.

కాలక్రమాన, కళపై పెరికోల్‌కుగల శ్రద్ధాసక్తులు సన్నగిల్లుతున్నాయి. తన నటనలో కలిగిన ఒక విధమైన సంతృప్తివల్ల ఆమెలో అశ్రద్ధ పెరిగిపోయింది. ఉత్తమమైన స్పానిష్ నాటకాలలో స్త్రీ పాత్రలకు తగినంత ప్రాముఖ్యత లేకపోవడం ఇందుకు కొంత కారణం... స్పెయిన్‌లోని నాటక రచయితలు — గౌరవ ప్రతిష్ఠల సంఘర్షణలో పోరాటం సాగించేవారినీ, లేదా పాపపంకిలమయిన జీవితం గడిపి చివరకు ఏసుప్రభువు సన్నిధికి చేరేవారిని, నాయకు లుగా చిత్రించి, తమ శ్రద్ధాసక్తులన్నీ వారిమీదనే కేంద్రీక రించేవారు...ఆమె ధరించే పాత్రలపై పెరికోల్‌కు శ్రద్ధ కలిగించే మార్గాలను వెతకడానికి, పిమోమాము చాలా కాలం పాటుపడ్డాడు. ఒకానొక సందర్భంలో 'విగోడిబరేరా' మనుమరాలు పెరూ వచ్చిన వార్త పెరికోల్‌కు చెప్పాడు.

గొప్ప కవిపుంగవులపై పియోమామ కెంతటి గౌరవాభి మానాలున్నవో కెమిలాకు తెలుసు. మహాకవులు, రాజుల కంటే అధికులని ఋషిపుంగవులకంటే తక్కువవారు కారని, పియోమామకుగల అభిప్రాయానికి ఆమె ఎన్నడూ అఘాతం కలిగించలేదు. అందుచేత యిద్దరూ మహోత్సాహంతో ఆ మహాకవినాటకాలలో ఉత్తమోత్తమమైన దానిని ఎన్ను కున్నారు. ఆ మహాకవి మనుమరాలి సమక్షంలో దాన్ని ఘనంగా ప్రదర్శించాలని వారి ఉత్కంఠ. ఒక్కొక్క పద్యాన్ని కొన్ని వందలసార్లు సాధన చేశారు. ప్రదర్శనం నాటి రాత్రి, తెరచాటునుంచి పియోమామ ఒకానొక మధ్య వయస్కురాలైన స్త్రీని కెమిలాకు చూపించాడు. ఆ స్త్రీ దారిద్ర్యంతో - కుటుంబ భారంతోనూ క్రుంగి పోయినట్లు కన్పించినా, ఆమెలో లోకంలోని సౌందర్యం, ప్రౌఢత్వం అంతా మూర్తీభవించినట్లు-కెమిలాకు కన్పిం చింది. ఆమె రంగస్థలం ప్రవేశించే సమయ మాసన్నమవక ముందే గుండె దడ దడలాడి, గౌరవ పురస్సరమైన నిశ్శబ్దంతో పియోమామను కౌగలించుకుంది. అంకాల మధ్య గల విరామ సమయంలో, తానెవ్వరికీ కన్పించకుండా, ఒక మారుమూల గదిలోకిపోయి-దిక్కులుచూస్తూ కూర్చునేది. ప్రదర్శనానంతరం పియోమామ 'విక్టోడిబరేరా' మనుమ రాలిని కెమిలా గదిలోకి తీసుకువచ్చాడు. కెమిలా సంతోషంతో, సిగ్గుతో ఏడుస్తూ, దండెంమీద వ్రేలాడు తున్న గుడ్డల్లో మొహం దాచుకుంది. చివరకు కెమిలా ఆమెముందు మోకరిల్లి ఆమె చేతులను ముద్దుపెట్టుకున్నది.

ఆ స్త్రీకూడా కెమిూలా చేతులను ముద్దాడింది. ప్రదర్శన పైపోవడంవల్ల ప్రేక్షకులందరూ ఇండ్లకు వెళ్ళిపోయారు. కాని ఆ స్త్రీ మాత్రం చాలా ప్రొద్దుపోయేవరకు కెమిూలా గదిలోనే కూర్చొని, విక్టోరొక్క రచనలనుగురించీ, అతని అలవాట్లను గురించీ, తమ కుటుంబ పరిస్థితులను గురించి కబుర్లుచెబుతూ గడిపింది.

మరొక క్రొత్తనటి నాటక సంఘంలో ప్రవేశించి నప్పుడు- పియోమూమ ఆనందానికి మేర లేదు. అటువంటి సమయాల్లో యెదుటివారితో పోటీపడి; యింకా అభివృద్ధిని సాధించటానికి ప్రయత్నించే స్వభావం కెమిూలాకు ఉండ టమే అందుకు కారణం—ప్రదర్శన సమయంలో ప్రేక్షకుల వెనుక నిలబడి ఆనందంతో, ఒకవిధమైన అసూయతో చూస్తూన్న పియోమూమకు, అంతర్గతమైన ఒక దివ్యజ్యోతి ప్రభావంవల్ల ప్రకాశిస్తున్న చలువరాతి బొమ్మలా కన్పిం చింది కెమిూలా. సునాయాసంగా క్రొత్తనటికంటే తాను అధికురాలనని నిరూపించుకున్నది. సుఖాంతమయిన నాట కాలలో ఆమెచేసే చమత్కారాలకు అంతు ఉండేదికాదు. అలాగాక రాగద్వేషాలతోనిండిన విషాదాంత నాటకాలలో ఆమె మూర్తీభవించిన ఉద్రేకంలా ఉండేది. ఆమె అను నయంగా తోటి నటునిమిూద చేయివేసినప్పుడు ప్రేక్షకుల హృదయాల్లో సానుభూతి పొంగి పొరలేది. కాని అలాంటి సంఘటనలు తరచుగా కన్పించేవికావు. సాంకేతికంగా ఆమె సాధించిన అభివృద్ధివల్ల, కష్టించి నటించవలసిన అవసరం కెమిూలాకు క్రమంగా తగ్గిపోసాగింది. కొన్ని కొన్ని సార్లు

ఆమె పరధ్యానంగా ఉన్నా ప్రేక్షకులా విషయాన్ని గమనించలేక పోయేవారు. ఈ విషయాన్ని గ్రహించిన పిమెూమాము మాత్రం క్రుంగిపోయేవాడు.

అసలు కెమిలా, సుందర వదనారవిందం గల యువతి. నిద్రించే సమయంలో మాత్రం ఆమె ముఖం మరోలా కన్పించేది. పొడుగైన పల్చటి ముక్కు, అలసిపోయిన పసిపాప నోరు, అసంతృప్తితో నిద్రపోతున్న ఆమె కనుగవలు చూసినవారు అదిరిపడటం జరుగుతుంది. వీధుల నుండి వినువీధుల కెగిరిన యీ అనాధబాలిక, తన కళా తృష్ణకు, జీవితస్వప్నాలకు, ఆకలికి, నిర్విరామమైన వైసందిన కార్యక్రమానికీ సమన్వయం కుదర్చలేకపోయింది. ఇందులో అన్నీ అన్ని విభిన్నప్రపంచాలు. వీటిమధ్య నిరంతరంగా వెర్రి సంఘర్షణ జరుగుతూండేది. ఆమె ధరించే పాత్రలపై ఆమెకు సంతృప్తి లేకపోయినా–నటనవల్ల ఆమె హృదయం కొంత తేలిక పడేది. ఆ మహోద్రేకాల మాటల్లో ఆమెకు సౌఖ్యం లభించేది. కాని ఇంతకంటే నెక్కువగా ప్రేమోద్రేకం ఆమెను అతలాకుతలం చేసింది. కాని నటనకంటే, ప్రేమలో ఎక్కువ సౌఖ్యం లభిస్తుందనే నమ్మకం ఆమెకు ఎన్నడూ లేదు.

పెరూ వైస్రాయి 'డాన్ ఆండ్రెస్ డిరిచేరా' ఒకానొకప్పుడు చాలా ఉల్లాస పురుషుడేకాని యిప్పుడు అందుకు సంబంధించిన శిధిలాలు మాత్రమే అతనిలో నున్నాయి. పదిసంవత్సరాల దేశాంతర వాసంవల్ల; కొంత, విలాస జీవి

తంలో కొంత, భోగపరాయణత్వంవల్ల మరికొంత, అతని జీవితం శిథిలమై పోయింది. యువకుడుగా నున్నప్పు డాతడు - వెర్సయిల్స్, రోమ్‌లకు రాయబార వర్గాల్లో వెళ్లాడు. ఆస్ట్రియా యుద్ధంలో పాల్గొన్నాడు. జెరుస్లెంయాత్ర చేశాడు. సంతానవతి కాకుండానే అతనిభార్య మరణించింది. ఆమెకు చెందిన వల్లమాలిన ఆస్థి యావత్తూ మిగిలిపోయింది. పానీయాలంటే అతనికి ఎంతో యిష్టం. నటీమణులంటే అభిమానం. మేజాబల్ల ముందు సంవత్సరాల తరబడి కూర్చుని వాతరోగానికి గురియైనాడు.

విలాస మందిరంలో అతనికి ఒణుకుపుడుతుంది. తాను చాలా గొప్పవాడననే అహం అతనిలో ఆవహించి ఎదుటి వారు మాట్లాడేది విన్పించుకొనేవాడు కాదు. ఎటోచూస్తూ స్వగతం పల్కినట్లుగా ఎదుటివారితో మాట్లాడేవాడు· కెమిలా అక్కడక్కడా కొన్ని ప్రేమకలాపాలు కొన సాగిస్తున్నా- ప్రదర్శన శాలలోని దైనందిన జీవితం ఆమెకు విసుగు పుట్టించింది. ఆ సమయంలో యీ మేఘాలమీది అవతారపురుషుడు (అటువంటి వేషాలు వెయ్యడానికి అతడు చాలా బాగుంటాడు) ఆమెను ఆకస్మికంగా - తన అతః పుర సౌధంలోని కన్నులు మిరిమిట్లు గొలిపే విందులకు ఆహ్వానించాడు. తనను యింతగా నాదరించిన అతనిపట్ల యీామెలో నొక పూజ్యభావం ఏర్పడింది. ఆసౌఖ్యం తనకు చిరకాలం అలాగే వుండిపోతుందని ఆమె భావించింది. డాన్ ఆంద్రెస్ ఆమెకు చాలా గొప్పగొప్ప విషయాలు చెప్పే వాడు. ఆ విషయా లన్నింటినీ ఆమె ఉత్కంఠతో వినేది.

ప్రేమ జీవితంలో అటువంటి విషయాలను అమృతము లొలుకునట్లు మాట్లాడుకోవడం ఒక ముఖ్య ప్రక్రియగా భావించిం దామె. అతడామెకు కొద్దిగా ఫ్రెంచి భాషా పరిజ్ఞానాన్నికూడా ప్రసాదించాడు. ఇతరులను సంబోధించు నప్పుడూ, పరిశుభ్రంగా నుండుటకూ కావలసిన విషయాన్నంతటినీ ఆమెకు తెలియజేశాడు. గొప్ప గొప్ప సందర్భాలలో గొప్పగొప్ప స్త్రీలు ఎలా ప్రవర్తిస్తారో పియోమామ చెప్పేవాడు. కాని ఇప్పుడీతడు యెలా విశ్రాంతి కాలం గడపాలో బోధిస్తున్నాడు.

కాట్రెరస్, పియోమామలవల్ల కెమిలాలాకు స్పెయిన్ భాషలో చక్కటి పరిజ్ఞానం వచ్చింది. డాన్ ఆండ్రెస్ సహచర్యంవల్ల చమత్కారంగా మాట్లాడటం అలవాటయింది.

ఒకనాడు రాజసౌధానికి రమ్మని, అక్కడనుంచి కెమిలా పంపిన వార్తవిని పియోమామ ఆశ్చర్యపోయాడు. ఇంతకంటే ఏవో చిన్నచిన్న ప్రేమకలాపాలతో, ఆమె ప్రదర్శనశాలలోనే జీవితం గడపడం మంచిదని భావించాడు పియోమామ. కాని ఆమె కళానైపుణ్యం పెద్దలచే గుర్తింపబడి కొత్తరూపం సంతరించుకుంటున్నదని భావించి – కొంత సంతృప్తి నందాడు. ప్రదర్శనశాలలో వెనుకగా కూర్చొని-పెర్రి ఆనందంతో పచార్లుచేస్తూ — పెరికోల్‌నుచూసి, నాటక రచయితలు సృష్టించిన మహోన్నత జగత్తులో ఆమె విహరిస్తున్న విషయం ప్రేక్షకులకు గుర్తు చేస్తూండేవాడు. మధుపాత్రను స్పృశించడంలో, అంజలి ఘటించడంలో, రంగస్థలం ప్రవేశించటంలో, ఆమె విలక్షణమైన ఒక

ప్రత్యేక మార్గాన్ననుసరిస్తుంది. ఇంతకంటే పిరోమామకు కావల్సిన మరొక విషయమేమీ లేదు. ఒక ఉత్తమ కళా ఖండానికి, ఒక సౌందర్యమూర్తి యనదగిన స్త్రీ న్యాయం చేకూర్చటం కంటే కావల్సినదేముంది యీ ప్రపంచంలో? పరిశీలనా దృష్టితో వెలువడిన ప్రతిమాటలో గత జీవితానికి సంబంధించిన, గూఢార్థం ప్రస్ఫుటమాతూ - మృదుమధుర కంఠస్వరంతో, అనువైన భంగిమతో - వ్యక్తిగత సౌంద ర్యాన్ని వెదజల్లుతూ - మేళవించిన ఆ ప్రదర్శనంకంటే ఉత్తమమైనది యీ ప్రపంచంలో యింకేముంది? అని ప్రశ్నించేవాడు పిరోమామ.

కొంతకాలం జరిగిన తర్వాత...... అర్ధరాత్రి సమ యాల్లో తాము అంతఃపురాల్లో జరుపుకొంటున్న విందులకు అతిథులను ఆహ్వానించటం... పెరికోల్‌కు ఏమైనా అభ్యం తరం ఉంటుందేమోనని- వైస్రాయి ఆమెను అడిగి తెలుసు కోవాలనుకున్నాడు, అడిగాడు. అంతేకాదు ఆర్చిబిషప్‌ను కలుసుకోవడం నీ కిష్టమేనా? అని ప్రశ్నించాడు. కెమీలా తన అంగీకారాన్ని తెలియజేసింది. ఈ విషయం ఆర్చి బిషప్‌నకు కూడా ఆనందం కల్గించింది. ఆమెను మొదటి సారిగా కలుసుకున్నప్పుడు - ఆర్చిబిషప్ ఒక పచ్చల పత కాన్ని బహూకరించాడు.

ఊదారంగు పట్టు బురఖాలోంచి తొంగిచూసే మలిన సిక్తమైన శిరస్సొకటి లీమాలో ఉంది. అదే ఆర్చి బిషప్ తల. అతని కళ్ళలో ఏదో ఆవేదన, దయ, చమత్కారమూ, కలసి దాగివుంటాయి. ఆ క్రొవ్వెక్కిన దేహంలో బంధింపబడిన

ఆత్మ ఎందుకో పరితపిస్తున్నది. అతన్ని అతడే ఖైదు చేసుకున్నాడు. అతనికి తన దేవాలయంమీద అంతులేని అభిమానం ఉంది. కర్తవ్య దక్షుడు. ధ్యానసంపన్నుడు. కొన్నాళ్లాతని స్థూలదేహం అతనికెంతో దుఃఖాన్ని కలిగించింది. ప్రాచీన సాహిత్యాన్నంతా పఠించాడు. కాని ఏదో ఛాయా మాత్రమైన సౌందర్యాన్ని తప్ప, తక్కినవన్నీ మరచి పోయాడు. ఫాదరీలవద్ద నాతడెన్నో విషయాలు నేర్చుకున్నాడు. కాని యిప్పుడు వాది తగవులాటలు తప్ప మరోవిషయ మాతనికి గుర్తులేదు. కాగా ఆ తగవులాటలు పెరూకు ఎంతమాత్రం సంబంధించినవి కావు. అలాగే ఇటలీ, ఫ్రాన్స్‌లకు సంబంధించిన రకరకాల సాహిత్యాలను చదివాడు. కాని బ్రాటోమీ, అరెటినోల కథలు మాత్రమే అతనికి ఆసక్తి కల్గించేవి.

పెరూలోని మత ప్రచారకు లందరూ వంచకులేనని అతనికి తెలుసు. కాని అతనికి కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయి. ఆ అభిప్రాయాలను పునశ్చరణ చేసికోవడం మినహా అతడింకేమీ చేయలేదు. అవి ఇవి. ప్రపంచంలో ఈ దుఃఖం– ఈ అన్యాయాలూ, శాశ్వతమైనవి. మానవాళి ఏదో పురోగమిస్తున్న దనుకోవడం ఒక భ్రమ. ఎన్నడూ సుఖమంటే ఏమిటో చవిచూడని దీనులకూ, దురదృష్టాల బాధ అర్థంకాదు. అందరు శ్రీమంతులకు వలెనే అతడు కూడా, బీదలు నిజంగా బాధపడగలరని నమ్మేవాడుకాదు. అందరు సంస్కారవంతులవలెనే– అతడుకూడా– బాగా చదువుకున్న వారు మాత్రమే తాము పడుతున్న బాధలు గ్రహించగల

రనుకొనేవాడు. ఒకసారి అతని పరగణాలో జరుగుతూన్న అక్రమాలన్నీ అతనిదృష్టికి తీసుకురావడం జరిగింది. అందుకు ఏదో ఒకటి చేయాలనుకున్నాడు. ప్రజలకు కొద్ది విమోచనం కలిగించడానికైతే కొద్ది లంచాన్నీ - పూర్తి విమోచనం కల్గించడానికైతే ఎక్కువ లంచాన్నీ - మత ప్రబోధకులు పుచ్చుకోవడం పెరూలో నొక ఆచారంగా మారింది. ఈ విషయం విని ఆర్చిబిషప్ మండిపడ్డాడు. వా రందరికీ తీవ్రమైన ఆదేశాలు పంపించాలని - కాగితం, కలం తెమ్మనమని కార్యదర్శిని ఆజ్ఞాపించాడు. కాని సిరాబుడ్డిలో సిరా అయిపోయింది. ఆ ప్రక్కగదిలోకూడా సిరా లేకపోయింది. ఆఖరుకి ఆ యింట్లో చుక్క సిరా అయినా దొరక్కుండా పోయింది! తన యింట్లో పరిస్థితులు యింతగా దిగజారిపోయినందులకు అతనికోపం పదింత లయింది. ఆ రెండుకోపాల సమ్మేళనంవల్ల శరీరంలో రుగ్మత ఏర్పడింది. కాని ఆ తరువాత సమానంతో ఉండటానికి అలవాటుపడ్డాడు ఆర్చిబిషప్.

డాన్ ఆండ్రెస్‌తోపాటు, ఆర్చిబిషప్‌కూడా విందులకు హాజరవడం సలక్షణంగానే జరిగిపోయింది. కాగా, పియోమామ కూడా, అత్యవసరమైన వ్యక్తిగా భావించిన పైస్రాయి - కెమిలా అనుమతితో - అతన్నికూడా ఆహ్వానించాడు. ఒకసారి పియోమామ తనతోపాటు గుర్రపు పందెంలో ప్రయాణాలు చేస్తూ - పృథ్వినంతా కలియజూస్తూన్న కెప్టెన్ ఆల్వార్డోను తీసుకువచ్చాడు. ప్రదర్శన శాలనుంచి ఆనాటి కార్యక్రమం ముగించుకొని, అర్ధరాత్రి ఒంటిగంట సమయంలో పెరికోల్ దేదీప్యమానంగా వెలిగి

పోతూ, అలసటతో కొంచెం తూలుతూ, వైస్రాయి భవ నానికి వచ్చేది. ఈ నలుగురు పురుషులూ ఆమెను ఒక మహారాణిలా ఘనంగా ఆహ్వానించేవారు. సంభాషణలు ప్రారంభమయ్యేవి. కొంతసేపటికి డాన్ ఆండ్రెస్ భుజాల మీదకు ఒరిగిపోతూ ఆమె సంభాషలు కొనసాగించేది. కులాసాగా ఒకరి తరువాత మరొకరు చెబుతూన్న కబుర్లను ఆమె వినేది. దయ్యాలను గురించీ, మానవుడు పుట్టక పూర్వం గల యీ పుడమి తల్లి స్వరూపాన్ని గురించీ - విశ్వంలోని గోళాలు ఒకదానితో నింకొకటి ఢీకొని-క్రిందకు రాలిపోయే అవకాశాల గురించీ, ఆత్మయొక్క స్వరూప స్వభావాలను గురించీ, ఏసుప్రభువు రెండవసారి జెరూస్లెమ్ రావడం గురించీ, యింకా అనేకవిషయాలపై వారిసంభాషణ సాగేది. యుద్ధాలు, రాజులు, కవిపండితులూ, లోకంలోని అద్భుత ప్రదేశాలు అన్నీ వారి సంభాషణల్లో పరుగెత్తేవి. ప్రతి ఒక్కరూ తమ విజ్ఞాన సర్వస్వాన్నీ మాటల్లో ఒలక బోసేవారే! మానవ జీవిత మెంత అర్థరహితమైనదో వ్యాఖ్యానించేవారే! బాలభానుని బంగారు కిరణాలు అంతః పుర మందిరంలోనికి దూసుకువచ్చి ప్రసరించేవి. ఆ కాంతిలో వైస్రాయి ఒడిలో విశ్రాంతి తీసుకుంటున్న - మృదువైన భావగర్భితమైన పెరికోల్ ఫాలభాగము కన్పించేది. అక్క ణ్ణుంచి నిష్క్రమించటానికి తామే ముందుగా ఎవ్వరూ ప్రయత్నించేవారు కారు. అందరి చూపులు - తమ మధ్య సౌందర్యంగా కప్పుకొని వింతగా నిద్రపోతున్న యౌవనిపై పడేవి. పిరోమామ చూపులు రాత్రి తెల్లవార్లు ఆమె

నంటిపెట్టుకొనే ఉండేవి. ఆర్ద్రంగా, ఏవో ఆవేదనతో నిండిన అతని నీలిరంగు కళ్లు ఆమెను చూస్తూ తన జీవిత రహస్యాన్ని – దాని కారణాన్నీ తెలుసుకోవడానికి ప్రయత్నించేవి. కెమీలాను చూడకుండా ఒక్క క్షణంకూడా గడుపలేక పోయేవాడు పియోమామ. ఈ ప్రపంచంలోని మానవాళినంతా అతడు రెండు భాగాలుగా విభజించాడు. ఒకటి ప్రేమించినవాళ్లు, రెండు అలాంటిపని చేయనివాళ్లు. కొందరికి ప్రేమించేశక్తి– ప్రేమపాశంలో బాధపడే అదృష్టం... ఉండదు... అవి క్షుద్రమైన గడ్డిపరకలవంటి జీవితాలు. అర్థరహితమైన నవ్వులతో, కన్నీటితో, ప్రేలాపనలతో, యీ ప్రపంచాన్ని నింపడమే వారి జీవితాల ప్రయోజనం. ఈ విభేదానికి, ప్రేమకూ ఆతడొక నిర్వచనం చేసికొన్నాడు. అతని అర్థం అతనిదే. అతని వికార జీవితంలోని, దర్పమూ, దుఃఖమూ అంతా ఆ అర్థంలో గూడు కట్టుకున్నాయి. ప్రేమ ఒక క్రూరమైన, భయంకరమైన రోగమని అతడి అభిప్రాయం. ప్రేమను ఆరాధించేవారంతా, దాన్ని అనుభవించి, దాని ఫలితంగా పాలిపోతారు. అయినా జీవించడానికి మాత్రం సిద్ధంగానే ఉంటారు. ఇటువంటి వలలో కెమీలా యింకా చిక్కుకొనలేదని, పియోమామ అభిప్రాయం. వైస్రాయికీ, ఆమెకు పరిచయమైన తరువాత – కొన్ని నెల లాతడు ఊపిరి బిగపట్టి–నిరీక్షించాడు. సంవత్సరాలు కూడా గడిచాయి. కెమీలా యిప్పుడు ముగ్గురు పిల్లలకు మాతృదేవత. అయినా ఆమెలో మార్పేమీ లేదు. ఆమెకు ప్రపంచంలో తొలిసారిగా కలుగుతూన్న ఈనూతనాను

బంధ ప్రభావం, ఆమె నటనపై సరికొత్త ప్రభావాన్ని ప్రసరి స్తుందని ఆతనికి తెలుసు. ఆమెలో మొలకెత్తిన యీ నూతనానుభవంవల్ల కొన్ని నాటకాలలోని - కొన్ని సంభా షణలను, అంతర్గర్భితమైన ఆనందంతో సమన్వయ పరచి- యింకా సజీవంగా అనగలదని అతడు భావించాడు. కాని అందుకు భిన్నంగా, తత్తరపాటుతో సంభాషణలు సాగి పోయేవి. రానురాను డాన్ ఆండ్రడన్‌పై ఆమెకు విసుగుపుట్టి యితరములైన అనేక ప్రేమ కలాపాలు సాగించడం మొదలుపెట్టింది. అందులో కొందరు తోటినటులు, కొందరు నగరంలోని వర్తకులు, మరికొందరు ఎద్దు పందాలలో పాల్గొనే వస్తాదులు!

అంతేకాదు. రానురాను ఆమెకు నటనంటే వెగటు అనిపించింది. మనః పథంలో ఆలోచన మెరిసింది. ఆమె ఒక గౌరవనీయురాలైన గృహిణిగా ఉండా లనుకున్నది. నటిగా తన జీవితాన్ని ఒకనాటి ముచ్చటగా చిత్రించు కుంటూ, దాదిని వెంటబెట్టుకుని చర్చికి వెళ్ళి రావడం ప్రారంభించింది. విశ్వవిద్యాలయాల బహుమతి ప్రదానోత్స వాలకు హాజరై - భూరి విరాళాలిచ్చే దాతల సరసన కూర్చొనేది. కొద్దిగా వ్రాయడం, చదవడం అలవరచు కొన్నది. ఈ ఆదర్శాన్ని సాధించడానికి, వైద్రాయి పలుకు బడినంతా వినియోగించుకున్నది. ఈ కొత్త దుర్గుణంవల్ల పాతదుర్గుణాలన్నీ తుడుచుకు పోయాయి. ఆమె సుగుణ సంపత్తి ఒక సొదగా మారింది. ఆమె ప్రాథమికంగా, ఎక్కడ లేని తల్లిదండ్రులనూ బంధుమిత్రులను సృష్టించు

కుంది. తన పిల్లలు గౌరవనీయమైన పుట్టుక గలవారన
టానికి కావల్సిన హంగులన్నీ సమకూర్చుకుంది. సంఘంలో
గౌరవ ప్రతిష్ఠలుగల స్త్రీగా తిరుగాడటం నేర్చుకుంది. పాప
పరిహారార్థం - అందరు కుటుంబ స్త్రీలతోబాటు, ఆమెకూడా
క్రొవ్వొత్తిపట్టుకొని ఊరేగింపులో పాల్గొనేది. ఆమె చేసిన
పాపమల్లా నటిగా కొంతకాలం జీవనయాత్ర సాగించడమే.
కాని జలాసిన్, జెనిసిన్, మార్గరెట్, అంటాయిచ్,
పెలాగియావంటి గొప్ప యోగులెందరో నటులుగా జీవించిన
విషయం అందరికి తెలుసును.

శాంతామేరియా డికుక్సంబా కాకు అనతి దూరంలో
ఒక అందమైన సీటివనరు ఉంది. అక్కడ డాన్ ఆండ్రస్
ఒక నివాసాన్ని ఏర్పరిచాడు. ఎద్దుపందాలకూ, ప్రదర్శనాలకు
వసతులు కల్పించబడ్డాయి. అందమైన గదులు - ఫ్రెంచి
నమూనాలో చక్కని ఉద్యానవనాలూ ఏర్పాటు చేయ
బడ్డాయి. కెమిలాలా ఆరోగ్యానికి ఎన్నడూ ఎటువంటి
భంగమూ రాలేదు. కాని ఆప్రాంతంలోనే ఆమెకూడా ఒక
నివాసా న్నేర్పరచుకుంది. ఈ భూతల స్వర్గాన్నిగురించి
మార్క్విసా డి మాంటిమేయర్ అద్భుతంగా వర్ణించింది.
రాత్రింబవళ్ళు పెద్దముత్తాలతో పందెం ఒడ్డి అలసిపోయిన
వైస్రాయిని ఆమె చక్కగా చిత్రించింది. దాని ప్రక్కనే
అతనికీ, కెమిలాలాకు జన్మించిన కుమారుడు డాన్‌జైమ్
చిత్రణకూడా ఉన్నది.

ఏడుసంవత్సరాల వయసులో అతడు చాలా నలతగా
నుండేవాడు. తల్లి యొక్క కళ్ళు - నుదురు; తండ్రియొక్క

వణుకు అతగాడికి సంక్రమించాయి. ఎంత వెర్రిబాధనైనా మూగ జీవిలా అనుభవించేవాడు. వస్తుతః అతడు చాలా అందగాడు. తన బాధల్ని గురించి అతనికిగల అభిప్రాయాలు సహనంతో కూడుకొన్న ఒక హుందాతనా న్నిస్తున్నాయి. తల్లి బిడ్డలమధ్య బాంధవ్యం బాగానేఉంది. తాను కలలు గంటున్న సాంఘిక గౌరవం యెప్పుడు లభిస్తుందాయని ఆశ్చర్యపోతూ కెమిలాయున్నా, ఆ వాతావరణాన్ని అనుభవిస్తూ మబ్బులకోసం చూస్తూ - డాన్ జైన్ యున్నా మిద్దెమీద పచార్లు చేస్తూండేవారు. వారు ఎక్కడో మూరు మూల దేశాలనుంచి వచ్చిన మానవుల్లా కన్పించేవారు. లేదా కథల్లోని పాత్రలు ప్రాణంపోసుకొని లేచి వచ్చి నట్లుగా తోచేవారు. ఈలోకపు భాష యింకా తెలియక; యీ మనుష్యులతో పొత్తు కలియక, ఒంటరి తనా న్ననుభ విస్తున్న వ్యక్తుల్లా కన్పించేవారు. ముప్పై సంవత్సరాల వయస్సులో ఆమె రంగస్థలంనుంచి నిష్క్రమించింది. తాను కలలు గంటూన్న సాంఘిక గౌరవ ప్రపత్తులను పొందడానికి అయిదు సంవత్సరాలకాలం పట్టింది. ఆమె ముఖం నానాటికీ అందంగా మారుతున్నా, ఆమె క్రమ క్రమంగా లావెక్కి పోతున్నది. ఆమె అమితంగా శృంగారించుకొనేది. కండ్లకు మిరిమిట్లు గొలిపే రత్నాలంకారాలతో ఆమె మందిరం ప్రకాశించేది. ఆమె ముఖానికి నీలిరంగు పౌడరు, పెదిమలకు ఎర్రని రంగు వేసుకొనేది. ఈ అభివృద్ధిని సాధిస్తూన్న తొలి రోజుల్లో తనతో బహిరంగంగా కన్పించటానికిష్టలేదని ఆమె పిమోమామను హెచ్చరించింది. రానురాను అతని తోటి

రహస్య సమాలోచనలను సైతం ఆమె కంటగించుకో సాగింది. లాంఛనప్రాయంగా అతనితో ముక్తసరిగా మాట్లాడేది. అతని సమక్షంనుంచి తప్పించుకు పారిపోవాలని ఆమె కళ్ళు ప్రయత్నించేవి. అతనితో జగడమాడేటందుకు నెపాలను వెదుకసాగింది. ఆమె సహనాన్ని పరీక్షించడానికి కాబోలు పియోమామ నెల కొకసారైనా అక్కడికి వచ్చి పోయేవాడు. కొన్నాళ్ళకు ఆమె సందర్శన భాగ్యమే కరువయిపోయింది. అయినా ఆమెపిల్లలతో ఒక్క గంట సేపయినా ముచ్చటించి మరీ పోతూండేవాడు పియోమామ.

ఒకరోజున పియోమామ కెమీలా నివాసానికి వచ్చి ఆమెను ఒక్కసారి చూసి, కొంచెంసేపు మాట్లాడిపోతానని దాసీతో కబురంపించాడు. సూర్యాస్తమయ సమయంలో ఫ్రెంచి గార్డెన్‌లో అతనిని కలుసుకుంటానని కెమీలా సమాధానం పంపింది. అతడొకవిచిత్రమైన భావనాముద్రతో లీమా నుండి బయల్దేరాడు. అనేకమంది ఒంటరి జీవులకుమల్లే ఇతడు గూడా ఒక దివ్య సౌందర్యరాశితో స్నేహంచేయాలని ప్రయత్నించాడు. వీధుల్లో విరగబడి నవ్వుకుంటూ పోతూ-విడిపోవలసినప్పుడు ఒకరి నొకరు గాఢాలింగనం చేసికొంటూ కలసి మెలసి చిరునగవులతో విందులారగించే తోటి మానవులందరూ ఏదో సంతృప్తిని పొందుతున్నారనే ఊహ అతనిలో మెదిలింది. ఆకస్మికంగా ఆమెనుచూసి మాట్లాడి 'పియోమామా!' అనే పిలుపువిని—తమ గత జీవితపు సుదీర్ఘమైన సంచార సహచర్యాన్ని తిరిగి పునరుద్ధరించాలనే తీవ్రమైన ఆవేదన అతనిలో రేకెత్తింది. ఫ్రెంచి గార్డెన్‌లు

పట్టణానికి దక్షిణభాగంలో ఉన్నాయి. గిబ్బిలాలు యధేచ్ఛగా ఎగురుతూ పోయే సమయ మది. చిన్నచిన్న జంతువులు నిర్లక్ష్యంగా తిరుగాడు తున్నాయి. కొంతమంది ఒంటరిజీవులు దిగ్భ్రమ చెంది ఆకాశంలోకి అదేపనిగా చూస్తున్నారు. మరికొందరు ఒక మూలగా జారగిలబడి, ప్రక్కనగల లోయలోకి తొంగిచూస్తూ దూరంగా అరుస్తున్న కుక్కలు ఏ గ్రామానికి చెందినవో అనుకుంటున్నారు. తండ్రులు యింటికివచ్చి కాస్సేపు కుక్కలతో కాలక్షేపం చేసే సమయ మది. ఆడపిల్లలు ఆకాశంలోని నక్షత్రాల కేసి—మొగపిల్లలు ఆకలితో భోజనంకోసం ఎదురుచూసే సమయమది. క్షణం తీరిక లేని యింటి యజమానురాలుకూడ ఒక నిముషం నిలబడి స్వర్గసీమలవంటి తమ గృహసీమలను చూస్తూ చిరునవ్వు నవ్వించే ముహూర్త మది.

పియోమామ ఒక పాలరాతి బెంచీమీద కూర్చొని అప్పుడే వస్తూన్న కెమీలాను చూశాడు.

"కొంచె మాలస్యమయింది! పొరబాటే! యింతకీ నువ్వు నాకు చెప్పదలుచుకొన్న విషయం ఏమిటి?" అంది కెమీలా.

"కెమీలా —"

"నా పేరు డోనా మై కెయిలా"

"నిన్ను కించపరచాలని నా వుద్దేశం కాదు డోనా మై కేయిలా! కాని ఇరవై సంవత్సరాలపాటు కెమీలా

అనే పేరుతో నన్ను పిలువ నిచ్చావు. అందుకని...
నేను... ..."

"సరే, కానీ! నీకెలాగు యిష్టమైతే అలాగే చెయ్యి"

"కెమీలా! నేను చెప్పే మాటలు వింటానని వాగ్దానం చెయ్యి. నేను చెప్పిన మొదటిమాట వినగానే పారిపోనని మాట యివ్వు"

ఆమాట వినగానే ఆకస్మికంగా మండి పడుతూ కెమీలా "పియోమామ! నే చెబుతున్నా! విను! నన్ను తిరిగి నాటకశాలలోకి తీసుక పోవాలనే నమ్మకం నీకు వుంటే అది పిచ్చిగాని మరొకటి కాదు. నేను వెనక్కి తిరిగి రంగ స్థలాన్ని జూచినప్పుడల్లా భయంతో వణికి పోతున్నాను. తెల్సిందా? అవును! నాటక శాలంటేనే నాకు అలా అని పిస్తోంది. అక్కడ రోజూ ఎదుర్కోవలసిన అవమాన పరం పరలు ఎటువంటివో నాకు తెలుసు. నువ్వు అనవసరంగా నీ కాలాన్ని పాడు చేసుకుంటున్నావు."

అతడు సౌమ్యంగా జవాబు యిచ్చాడు "ఈ కొత్త స్నేహితులతో నీకు ఆనందంగా వుంటే మళ్ళీ తిరిగి రమ్మని నిన్ను అడగను"

"అయితే నా కొత్త స్నేహితులంటే నీ కిష్టంలేదా? మరి యెటువంటి వాళ్ళతో తిరగమంటావు?"

"కెమీలా! నాకు గుర్తు ఉన్నదల్లా —"

"నన్నేమీ నువ్వు విమర్శించ నక్కర్లేదు. నీ సలహా నాకవుసరం లేదు. నేను తొందరగా యింటికి పోవాలి. నా విషయం నువ్వు మరచిపోతే చాలు. అదే పదివేలు"

"కెమిలా! కోపగించుకోకు. కొంచెం సేపయినా నీతో మాట్లాడనీ. నాకోసం ఒక్క పది నిముషాలు బాధపడు"

ఆమె యెందుకు ఏడుస్తున్నదో అతనికి అర్థం కాలేదు. ఏమని అనునయించాలో తోచలేదు. ఏదో చెప్పాడు. "నువ్వు నాటక శాలవైపు కన్నెత్తి చూడనైనా చూడటం లేదు. ఆ విషయం అందరూ తెలుసుకున్నారు. ప్రదర్శన శాలకు వచ్చే ప్రేక్షకుల సంఖ్య నానాటికీ దిగజారి పోతోంది. వారానికి రెండుసార్లు ఏదో ఓకథ నడిపిస్తున్నాం. అంతా మందంగానూ, అపసవ్యంగానూ నడుస్తోంది. ఒక్కరూ సంభాషణలు సరిగా చెప్పలేరు. ఆఖరికి ఎలా నడవాలో గూడా వారికి తెలియదు. ఒక పండుగనాడు బెల్‌షజార్ యొక్క 'ఫీస్టు' ప్రదర్శించారు. అందులో నువ్వెంత అద్భుతంగా ఉండేదానివో, ఇప్పుడంత సిగ్గు చేటుగానుంది."

కొంతసేపు నిశ్శబ్దంగా గడిచి పోయింది. దూర తీరాల్లో గొఱ్ఱెల మందలవలె – నింగిలో కొండలను, లోయలను అధిగమించి సాగిపోతూన్న మబ్బులగుంపు కన్పించింది. కెమీలా ఆకస్మికంగా అతని పాదాలను స్పృశించింది. ఇరవై సంవత్సరాల నాటి ముఖంవలె ఆమె ముఖం మారిపోయింది. "పియోమామా! నన్ను క్షమించు. చాలా చెడ్డగా ప్రవర్తించాను. మధ్యాహ్నం నుంచి క్లైమ్‌కు ఒంట్లో బాగుండటం లేదు. ఏం చెయ్యాలో ఏమీ తోచడం లేదు. తెల్లగా పాలిపోయి, ప్రక్కమీదకు వాలిపోయాడు. పియో మామా! మళ్ళీ నేను నాటకాలు వేయడం ఏమాత్రం

మంచిది కాదు. ఇంకా మనం పాత భాగోతాలను ప్రదర్శిం చడం వెర్రితనం. అంతగా కావా లనుకున్నవాళ్ళు ఆ నాట కాలను చదువుకుంటారు."

"కెమీలా, నువ్వు అద్భుతమైన స్త్రీవి. నువ్వు నాట కాలు వేసినప్పుడు నేను నీకు న్యాయం చేయలేదు. నాలో గల దర్పం నన్నలా చేయించింది. నువ్వు నిజంగా అద్భు తాలివైనా నేను నిన్ను ప్రశంసించలేక పోయాను. నన్ను క్షమించు కెమీలా! నువ్వు గొప్ప కళామూర్తివి. ఇక్క డున్న ప్రజలపై నీకు విరక్తి కలిగితే మనం మాడ్రిడ్ వెళ్ళ వచ్చును. యౌవన సౌందర్యాలు నీలో యింకా పొంగులు వారుతూన్నాయి. డోనా మైకేయిలా అనే గౌరవమైన పేరును సంఘంలో ఎప్పటికైనా సంపాదించుకో వచ్చును. నాట్యకళను ఇప్పుడే ఉపాసించాలి. అనతి కాలంలోనే మనల్ని జరాభారం కృంగ దీస్తుంది. మృత్యువు ఆసన్న మౌతుంది."

"వీల్లేదు. మళ్ళీ స్పెయిన్ నే నెన్నడూ చూడదల చుకో లేదు. మాడ్రిడ్ కు - లీమాకు తేడా యేమీ లేదు. ప్రపంచమంతా నొకే విధంగా ఉంది."

"సరే, మన మెక్కడికన్నా ఓ ద్వీపానికి వెళ్ళిపోదాం. అక్కడి ప్రజలు నిన్ను నిన్నుగానే చూసి గౌరవిస్తారు. ప్రేమిస్తారు."

"పిరికోమామ! నీకు యాభై సంవత్సరాల వయస్సు వచ్చింది. అయినా యింకా అటువంటి కలలు గంటున్నావు".

పియోమాము తలవంచి గొణుక్కుంటున్నాడు. "కెమీలా! యదార్థంగా నిన్ను నేను ప్రేమించాను. నేను చెప్పగల్గినదాని కంటే యెంతో అధికంగా ప్రేమించాను. నువ్వు నాకు తెలిసిన వ్యక్తివి కావడమే యీ బ్రతుక్కి చాలు. నువ్విప్పుడు గొప్ప స్త్రీవి. శ్రీమంతురాలివి. నేను నీకు సహాయంచేసే మార్గం లేదు! కాని అందుకు నేను సర్వదా సిద్ధంగా ఉన్నాను."

కెమీలా నవ్వుతూ అంది "నువ్వు ఎంత అసందర్భంగా మాట్లాడుతున్నావు? పసి పిల్లవాడి మాటల్లా ఉన్నాయి. వయస్సు వచ్చినా బుద్ధి చిన్నదిగానే ఉంది. నువ్వు అనుకున్న ద్వీపాలూ, ప్రేమలు నాటకాల్లో ఉంటాయి గాని యీ పృథ్విలో యెక్కడా ఉండవు."

అతడు సిగ్గుతో క్రుంగిపోయాడు. కాని సమాధానం మాత్రం కుదర్లేదు. చివరికి ఆమె లేచి నిలబడి "మనం మాట్లాడు కుంటూన్న దేమిటి? తల నొప్పిగా ఉంది. నే నిప్పుడు వెళ్ళిపోవాలి. నీ ప్రయత్నం ఇంతటితో విరమించు. నాకు నాటకాలమీద శ్రద్ధ లేదు." మరి కొన్ని నిమిషాల నిశ్శబ్దం తరువాత కెమీలా యింకా యిలా అన్నది "మిగిలిన విషయం...? ... నాకర్థం కావడం లేదు. పరిస్థితు లిలా వున్నాయి. నేనేమిటో అలాగే ఉండి తీరాలి. నా గురించి యిక ఆలోచించవద్దు. నా ప్రసక్తి మరచిపో. నన్ను క్షమించు. పియోమామా! నన్ను క్షమించమని అడుగుతున్నాను. అంతకంటే నేను కోరుకొనేదేమీ లేదు."

ఆమె ఒక్క క్షణం నిశ్శబ్దంగా నిలబడింది. ఆమె హృదయం ఎందుకో తీవ్రంగా స్పందిస్తూంది. పియో మామతో యేదో చెప్పాలనుకున్నది.

అప్పుడే చీకటి పడుతూన్నది. తోటంతా క్రమంగా నిర్మానుష్య మైపోతూన్నది. డాన్ జైమ్‌ను గురించి, డాన్ అంద్రెస్ గురించీ తనను గురించీ రకరకాల ఆలోచనలు ఆమె స్మృతి పథంలో మెలగుతున్నాయి. ఆమె నోటి వెంట మాట రావడం లేదు. ఆకస్మికంగా క్రిందకు వంగి పియోమామకు పాదాభివందనం చేసి గిరుక్కున పోయింది కెమీలా. అతడు మాత్రం మూగుతూన్న మబ్బు దొంతరల క్రింద ఏదో వెర్రి ఆనందాన్ని అనుభవిస్తూ - అయోమయంగా కన్పిస్తున్న తన జీవిత సమస్యల రహస్యాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ అలాగే కూర్చుండి పోయాడు.

ఆకస్మికంగా ఒక విషాద వార్త లీమాలో వ్యాపించింది. డోనా మైకేయిలా విల్లెగాస్ అని పిలువబడే కెమీలా పెరికోల్‌కు మశూచి వచ్చింది. ఆ నగరంలో అనేక వందల మందికి ఆ జబ్బు వచ్చింది. కాని యీ అందమైన నటీమణికి అటువంటి జబ్బు రావడం అందరికీ విచిత్రమైన ఆసక్తి కలిగించింది. నీచ జన్మురాలై నప్పటికీ - గొప్ప గౌరవం సంపాదించటానికి కారణమైన ఆమె సౌందర్యం దగ్ధమై పోతూన్నదనే పైశాచికానందం లీమా వాసుల హృదయాల్లో తాండవించింది. కెమీలా వికృతంగా మారి పోయిందనే రహస్యంగూడా యెలాగో బయట పడింది. తరు

వాత కొద్ది రోజులకే ఆమె నగరాన్ని వదలి కొండమీాద గల తన నివాసానికి వెళ్ళి పోయింది. ఆమె తన అందమైన సౌధాన్ని అమ్మివేసింది. తనకు బహుమతులుగా లభించిన రత్నాల హారాలన్నీ యెవరివి వారికి యిచ్చివేసింది. సొగసైన వస్త్రాలన్నీ తెగ నమ్మింది. ఆమెను హృదయ పూర్వకంగా అభిమానిస్తూన్న వైస్రాయి, అర్చిబిషప్ మొదలైన పురుషులు బహుమతులతో ఆమె ద్వారాలకడ పడిగాపులు పడి వుంటున్నారు. ఆమెను దర్శించే భాగ్యం వారికి లభ్యమవడం లేదు. వారిని చూడటానికి ఆమె నిరాకరించింది. ఎటువంటి వ్యాఖ్యానాలు చెయ్యకుండా బహుమతులను తిప్పి కొట్టింది. ఆమె జబ్బుపడిన తరువాత పరిచారికలకు తప్ప మరెవ్వరికీ తన ముఖం చూపించ లేదు. డాన్ అండ్రెస్ ఆమెను కల్సుకోవడానికి అనేక ప్రయత్నాలు చేసిన తర్వాత దానికి సమాధానంగా, ఆమె అధిక మొత్తంగా డబ్బును... దుఃఖంతో అభిమానంతో నిండిన ఒక ఉత్తరాన్ని పంపింది.

తమ సౌందర్యం వల్ల అనేక బహుమతులు, గౌరవాలు పొందిన అనేకమంది స్త్రీలకు వలెనే, కెమీలాకు కూడ – తనకు యితరులతో గల సంబంధాలకు, సౌందర్యమే ప్రాతిపదిక యని ఊహించుకుంది. అందుచేత యిక ముందు తన దగ్గరకు యెవరు వచ్చినా తనమీాద జాలి పడటానికే వస్తారు. తన సౌందర్యాన్నారాధించే వారికోసం తాను యెదురు చూడ నవసరం లేదు. ఆమె సౌందర్యం అంతరించి పోయింది. శరీర వ్యామోహంతో సంలీనం కాని

ప్రేమ ఆమె జీవితంలో యెరుగదు. అటువంటి ప్రేమవల్ల మధుర స్వప్నాలు, కవనాలు, కారుణ్యం అన్నీ కల్గవచ్చును. కానీ అందులో స్వలాభం ఉంది. ఆమె స్నేహితులు ఆమెను తిరిగి సంఘంలోకి తీసుకు రావాలని ప్రయత్నం చేస్తున్నకొద్దీ ఆమెకు వారిపై కోపం యెక్కువ అవుతోంది. దూషణలతో, తిరస్కారాలతో నిండిన సమాధానాలను వారికి పంపుతున్నది. ఆమె, ముముక్షువుగా మారుతున్నదని కొంతకాలం పాటు కొందరనుకున్నారు. కాని నిస్పృహతో ఆమె వెఱ్ఱిదై పోతూన్నదని మరికొన్ని వార్తలు ప్రచారంలోకి వచ్చాయి. ఆమె దగ్గర గలవారామె భయంకర స్థితిని భరించలేక పోతున్నారు. తన జీవితానికి, దానితోపాటు తన బిడ్డల బ్రతుకులకు రోజులు సమీపించాయనే భావం ఆమెలో నిండి పోయింది. ఆ వెఱ్ఱి దర్పంలో తనకున్న దానికంటే ఎక్కువగానే అందరికీ యిచ్చి వేసింది. లేమి ఆమె ఒంటరి జీవితాన్ని మరింత దుఃఖమయంగా మార్చి, ఆమె భవిష్యత్తును మరింత అంధకార బంధురం జేసింది. ఆమెకు జీవితంలో మిగిలినదేమీ లేదు. బీడై పోతున్న ఆచిన్ని పొలంలో – అసూయతో ఏకాంతంగా ఆ ముహూర్తం కోసం ఎదురు చూస్తూ గడపడమే ఆమెకిప్పుడు మిగిలినది. తన శత్రువు లనుభవిస్తున్న సౌఖ్యానందాలను జ్ఞప్తికి తెచ్చుకొని ఆమెకు మతిపోయేది. పిచ్చి కేకలువేస్తూ గదిలో గంతులు వేసేది.

పిరోషామామ నిరుత్సాహం చెందలేదు. ఆమె పిల్లలను సాకుతూ, భూమి వ్యవహారాలను చక్కబెడుతూ –

కావల్సినప్పుడు డబ్బు సర్దుబాటు చేస్తూ - ఆమె యింట్లో ప్రవేశం సంపాదించాడు. చివరకు కెమీలాను చూసే అవకాశం కూడా అతనికి లభించింది. కాని ఆ పరిస్థితిలో గూడ తన దర్పాన్ని ఒక గొప్పగా భావించుకొని, అతడు తనపై జాలి చూపుతున్నాడనే అభిమానంతో, వెర్రి ఆవేశంతో నాతని తిట్టి, దానివల్ల ఏదో కొంత సంతృప్తిని పొందింది. కానీ పిరోమాముకు ఆమెపై గల ప్రేమ మరీ యెక్కువైంది. ఆమె నిప్పుడు యింకా బాగా అర్థంచేసికొన్నాడు. కాని ఒక రోజున ఆకస్మికంగా ఒక ప్రమాదం జరిగింది. అతడు తలుపు నెట్టాడు. తలుపునకు తాళం వేశాననుకొని — మరచిపోయింది కెమీలా. ఒక గంటసేపట్నుంచీ ఆమెలో ఒక పిచ్చిఆశ బయలుదేరింది. సున్నపుముద్దతో తన ముఖానికి రంగు వేసుకోవాలనుకుంది. నటిగా తా ననేక వేషాలు ధరించింది. ఆ వేషధారణ యిప్పు డుపకరించ గలదేమో చూడాలనుకున్నది, కెమీలా. తలుపు తాళం వేశాననేధైర్యంతో అద్దం దగ్గరకువెళ్ళి ఆ ప్రయత్నంలో నిమగ్నురాలైంది. కాని ఆమెకు అద్దంలో దిగ్భ్రాంతుడై చూస్తూన్న పిరోమామ ప్రతిబింబం కన్పించింది. ఆమె ముఖాన్ని చేతులతో ముడుచుకొని - గావుకేకపెట్టి కుర్చీలోంచి లేచింది.

"వెళ్ళిపో! వెళ్ళిపో! ఎన్నడూ నా గుమ్మంలో అడుగుపెట్టకు. నీముఖం మళ్ళీ చూడదల్చుకోలేదు." అని కేకలు పెట్టింది. సిగ్గుతో క్రుంగిపోతూ, ద్వేషంతో దగ్ధమైపోతూ అతడ్ని గదిలోంచి తరుముతూ వెంటబడింది.

పిరయోమూమను ఆవరణలోకి అడుగుపెట్టనివ్వద్దని దాసీలను ఆదేశించింది. కాని ఆతరువాత వారంరోజులుపాటు ఆమెను చూడాలని విశ్వప్రయత్నాలుచేశాడు పిరయోమూమ. చివరికి లీమాకు తిరిగి వెళ్ళిపోయాడు. అక్కడే కాలం గడపాలని ప్రయత్నించాడు. కానీ పదునెనిమిది సంవత్సరాల యువకునిలా అత డామెకోసం పరితపించాడు. ఎలాగైనా సరే చూడాలని నిశ్చయించు కున్నాడు. అందు కొక వ్యూహాన్ని పన్ని – మళ్ళీ కొండల్లోకి బయల్దేరాడు.

ఒకరోజు సూర్యోదయానికి పూర్వం అతడు లేచి కెమిలా కిటికీదగ్గర నిలబడ్డాడు. తన కంఠస్వరాన్ని మార్చి ఒక బాలికవలె ఏడ్వ నారంభించాడు. ఒక పావుగంటసేపు యీ రోదన కార్యక్రమం సాగింది. వాతావరణం ప్రశాంతంగా ఉంది. చిరుగాలులకు కంపిస్తున్న తృణాల సవ్వడి తప్ప అంతా నిశ్శబ్దంగాఉంది. ఆకస్మికంగా నామె గదిలో దీపం వెలిగింది. కిటికీ తలుపులు తెరుచుకున్నవి. ఒక తల బయటకు తొంగిచూసింది. "ఎవరక్కడ ?" అని అడిగింది ఆ మధురమైన కంఠం.

పిరయోమూమ మాట్లాడలేదు. అసహానంతో కంపిస్తూ మళ్ళీ ప్రశ్నించింది కెమిలా "ఎవరక్కడ ? అక్కడ ఏడుస్తున్న దెవరు ?"

"డోనా మైకేయిలా ! ఒక్కసారి యిటు రమ్మని ప్రార్థిస్తున్నాను."

"ఎవరు నువ్వు ? నీకేమికావాలి ?"

"నే నొక బీదబాలికను. నాపేరు మెస్ట్రిల్లా. నాకు మీరొక సహాయం చేయాలి. మీ పాదాలకు మొక్కుతాను. దాసీని మాత్రం పిలువబోకండి. దయయుంచి మీరే రండి."

ఒక్కక్షణం కెమీలా నిశ్శబ్దంగా ఉండి, సరేనంటూ కిటికీ మూసింది. వెంటనే మందమైన ముసుగు ధరించి, ఆమె బయటకువచ్చి, దూరంగా నిలబడి "ఎవరువారు? యిలారా!" అని పిలిచింది.

పిరోమామ లేచి నిలబడ్డాడు, "కెమీలా! నేను పిరోమామను. నన్ను క్షమించు. నీతో మాట్లాడాలి."

"ఓ జగజ్జననీ! యీ భయంకర మానవుని బారి నుండి నాకు విముక్తి ఎప్పుడు? తెల్పిందా? నేను నిన్ను మళ్ళీ చూడదల్చుకోలేదు. నేను మరొక ప్రాణితో మాట్లాడ దలుచుకోలేదు. నా జీవితం సమాప్తమై పోయింది. అంతకు మించి చెప్పేదేమీ లేదు"

"కెమీలా! మన సుదీర్ఘ సహచర్యాన్ని దృష్టిలో పెట్టుకొని నేను నిన్నొక వరం అడుగుతున్నాను. నేనింక వెళ్ళి పోతాను. మళ్ళీ ఎన్నడూ నీకు బాధ కలిగించను."

"నేను నీ కేమీ యివ్వదలుచుకోలేదు. ఇవ్వను గూడా! ముందు యిక్కణ్ణించి వెళ్ళిపో."

"ఇప్పుడొక్కసారి నామాట విను. మళ్ళీ ఎన్నడూ నిన్ను బాధ పెట్టనని ప్రమాణం చేస్తున్నాను."

ఇంట్లోకి వెళ్ళిపోవడానికి కెమిలా తొందర పడు తోంది. ఆమెను వెన్నంటి పియోమామ యింకా ఏదో మాట్లాడుతున్నాడు. ఆమె ఆగింది.

"అయితే ఏమిటి? ఊఁ! తొందరగా చెప్పు......చలివేస్తున్నది. నా వంట్లో అసలేమీ బాగుండలేదు... నేను నా గదిలోకి వెళ్ళిపోవాలి."

"కెమిలా! డాన్‌జైమ్‌ను నాతో లీమా తీసుకొని పోయి ఒక్క సంవత్సరం పెంచుకుంటాను. అతడు నాదగ్గర చదువు నేర్చుకోవాలి. ఇక్కడ వాడు పనివాళ్ళతో కలసి తిరుగవలసి వస్తోంది. అతడికి అక్షరంముక్క తలకెక్కడం లేదు."

"వీల్లేదు."

"కెమిలా? వా డేమైపోతాడు? చదువుకోవాలనే తృష్ణ—అందుకు కావలసిన తెలివితేటలు వాడికున్నాయి."

"వాడి వంట్లో ఏమీ బాగుండలేదు...పైగా అతి సుకుమారుడు...నీ ఇల్లు ఒక పందుల దొడ్డిలా వుంటుంది. అత డిక్కడ ఉండటమే అన్నివిధాలా మంచిది."

"ఈ మధ్య వాడు బాగానేవున్నాడు. నాయిల్లు శుభ్రం చేసి, వాసయోగ్యం చేస్తాను. అలా చేస్తానని ప్రమాణం కూడా చేస్తాను. మాడ్రిషేరియా డెల్‌పిలార్‌ను అర్థించి ఒక పనిమనిషిని తెచ్చుకుంటాను. ఇక్కడ వాడు సోమరిగా మారి పోతున్నాడు. పెద్దమనుషులు నేర్చుకోవలసిన విద్యలన్నీ — లాటిన్ భాష — సంగీతం — సాము అన్నీ నేర్పుతాను. బాగా చదివిస్తాను."

"తల్లీ బిడ్డల్ని అలా విడదీయడానికి వీల్లేదు. అది పూర్తిగా అసాధ్యమయిన విషయం. నువ్వు పిచ్చివాడవు గనుకనే నీకు ఆ ఆలోచన తట్టింది. నాకు సంబంధిచిన విషయాలన్నీ మర్చిపో. నన్ను గురించి ఎన్నడూ ఆలోచించవద్దు. నేనిప్పుడు బ్రతికిలేను ... నా పిల్లలూ, నేనూ - మాకు వీలయిన పద్ధతిలో బ్రతుకగలం. బ్రతుకుతాం ... నా మనస్సు మళ్ళీ పాడు చెయ్యవద్దు. ఏ మానవుణ్ణీ నేను చూడ దల్చుకోలేదు."

ఇప్పుడు పియోమాను తీవ్రమైన ఆయుధాన్ని ఉపయోగించవలసి వచ్చింది. "సరే; నాకివ్వాల్సిన బాకీ ముందుగా చెల్లించు" అంటూ నిలబెట్టాడు.

కెమిలా తత్తరపడుతూ నిలబడింది. తనలో తాను 'జీవితం భరించలేనంత భారమైనది. మృత్యుదేవతకు నాపై కరుణ ఎప్పుడు కల్గుతుందో!' ననుకున్నది. కొంచెం సేపయ్యాక ఆమె దురుసుగా పియోమాకు సమాధానం చెప్పింది.

"నాదగ్గర ఎక్కువ డబ్బులేదు. ఉన్నదంతా యిచ్చివేస్తాను. ఇప్పుడే యిచ్చివేస్తాను. నాదగ్గర యింకా కొన్ని నగలున్నాయి. ఇవిగో. ఇంక మనం జీవితంలో ఒకరినొకరు కల్సుకోవాల్సిన అవుసరంలేదు." తన దారిద్ర్యాన్ని తలచుకొని ఆమె లజ్జాభారంతో క్రుంగిపోయింది. రెండడుగులు ముందుకువేసి వెనక్కుతిరిగి "నువ్వెంత కఠిన హృదయుడవో యిప్పుడు తెల్సింది. కానీ, నీబాకీ చెల్లించడమే మంచిది."

"వద్దు, వద్దు కెమీలా! నా ప్రార్థనను నువ్వు అంగీకరిస్తావని అలా మాట్లాడాను. నీ దగ్గర ఒక్క దమ్మిడీ అయినా పుచ్చుకోను. కాని ఒక్క సంవత్సరంపాటు డాన్ జైమ్‌ను నాదగ్గర ఉంచుకోనివ్వమని అడుగుతున్నాను. అతణ్ని నేను కంటికి రెప్పలా కాపాడుకుంటూ పెంచుకుంటాను. ఆకాలంలో నిన్ను పెంచుకున్నప్పుడు నీ కేమన్నా లోపం చేశానా?"

"కృతజ్ఞత! పదేపదే కృతజ్ఞత చూపమని నిర్బంధించడం కంటే క్రూరత్వం మరొకటి లేదు. నే నొకప్పుడు కృతజ్ఞత చూపెట్టాను. బాగా నేవుంది! కాని నే నిప్పుడు అప్పటి స్త్రీని కాదు. నీకు కృతజ్ఞత చూపెట్టడానికి నా దగ్గర ఏమీ లేదు."

ఆతరువాత కొంతసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది. ఆమె కళ్ళు ఆకాశంలో మెరుస్తూన్న నక్షత్రాలను చూస్తున్నాయి. ఆమె హృదయంలో ఏదో అవ్యక్తమైన బాధ అడవిమంటలా ప్రజ్వరిల్లింది. అర్థంలేని యేదో ప్రపంచానికి సంబంధించిన బాధ. ఆతరువాత ఆమె "జైమ్ నీతో రావాలనుకుంటే అలాగే కానీ. ప్రొద్దుటే నే నా విషయం బాబుతో మాట్లాడుతాను. నీతో రావడానికి వాడు యిష్టపడినట్లయితే, రేపు మధ్యాహ్నమే అతణ్ని నువ్వు తీసుకు వెళ్ళవచ్చు. ఇంక వెళ్ళిరా. భగవంతుడు నీకు మేలుచేస్తాడు."

ఆమె యింట్లోకి తిరిగివచ్చింది. మర్నాడు జైమ్ పిరోమామతో బయల్దేరాడు. అతని బట్టలన్నీ చిరిగిపోయాయి. కెమీలా దారి ఖర్చుకని కొంత డబ్బు

యిచ్చింది. నిద్రరాని రాత్రుల్లో ఆడుకుంటానికి, చీకట్లో కూడా వెలిగే ఒకమణినిగూడా యిచ్చింది. వాళ్ళు బండియెక్కి బయలుదేరారు. కానీ ఆ బండి కుదుపు పిల్లవాడికి మంచిది కాదని పియోమామ గ్రహించి, అతణ్ని తన భుజంమీదికి ఎత్తుకున్నాడు. వారు శాన్‌లూయీరే వంతెన దగ్గరకు వచ్చారు. జైమ్ తాను ఇతరుల సాంగత్యం వదులుకునే సమయం ఆసన్నమైనదని భావించి సిగ్గుపడ్డాడు. కాని దాన్ని పైకి కనిపించకుండా దాయడానికి ప్రయత్నించాడు. అందులోనూ పియోమామకు స్నేహితుడైన ఒక కెప్టెనును అప్పుడే సమీపించి, అతనితో పియోమామ మాట్లాడటం తనకు మరీసిగ్గుగా ఉంది. వంతెన చేరుకోగానే, ఒక పిల్లతో కలసి, వంతెన దాటడానికి ప్రయత్నిస్తున్న ఒక వృద్ధురాలితో కొంచెంసేపు పియోమామ మాట్లాడాడు. వంతెన దాటి ఆవలిఒడ్డు చేరినతరువాత కాస్సేపు విశ్రాంతి తీసుకుందామన్నాడు పియోమామ. కానీ అటువంటి అవుసరం వారికి రాకుండానే జరిగిపోయింది.

౫

# దైవ నిర్ణయమా?

పాతవంతెన స్థానంలో కొత్త వంతెన నిర్మించబడ్డది. కాని ఆ సంఘటనను మాత్రం ఎవరూ మరచిపోలేదు. ఒక లోకోక్తిగా మారింది. "వంతెన కూలకపోతే నిన్ను తప్పకుండా మంగళవారం కలుసుకుంటాను" అని చెప్పటం లీమన్లకు పరిపాటి అయింది. ఆ తరువాత అందరూ నవ్వుకుంటారు. దానికి కారణం: ఏ క్షణంలోనైనా ఏ ప్రమాదమైనా జరుగవచ్చుననే అర్థంకూడా దానిలో ఉంది. పెరూలియన్ సాహిత్యంలో ఆ సంఘటనను గురించి కవితలు వ్రాశారు... వాటిలో నిజమైన సారస్వత ఖండం జూనిపర్ వ్రాసినదే.

ఈ సంఘటన గురించి ఆశ్చర్యపడటానికి అనేక కారణాలున్నాయి. శాన్‌మార్టిన్ విశ్వవిద్యాలయంలో ఒక ఉపాధ్యాయుడి స్నేహమనేదే లేకపోతే – ఇటువంటి పనికి జూనిపర్ ఎన్నడూ ఉపక్రమించేవాడు కాదు. ఉపాధ్యాయుడి భార్య ఒకనాటి ఉదయం; ఒక సిపాయితో కలసి పడవమీద స్పెయిన్‌కు లేచిపోయింది. ఆమె కన్న యిద్దరి పిల్లల్నీ భర్త దగ్గరే వదలి మరీ పోయింది. దాంతో ఆ ఉపాధ్యాయుడి జీవితం విషాదాచ్ఛాదితమై పోయింది. కాగా జూనిపర్‌కు అటువంటి బాధలూ బరువులూ లేవు. లోకమంతా దుఃఖపూరితమనే అంధ విశ్వాసంలో ఉపాధ్యా

యుడికి ఒక రకమైన ఆత్మసంతృప్తి లభిస్తున్నది. అతడు నాస్తికుడయ్యాడు. లోకాన్ని రక్షిస్తూ మానవాళికి మార్గ దర్శకత్వం వహించే, ఒక మహత్తరశక్తి ఉన్నమాట శుద్ధ అబద్ధం అంటూ అతగాడు జూనిపర్ చెవిలో ఊదాడు. దానిని బలపరచడానికి, తారీఖులతో, దస్తావేజులతో నిండిన అనేక కథలు వర్ణించి చెప్పాడు. ఈ ధోరణి విన్నప్పుడు జూనిపర్ హృదయంకూడా ఒక క్షణంపాటు నిస్పృహతో నిండేది. పరాజయం వెన్నాడుతున్నట్లు భావించేవాడు. కాని అటువంటి కథలూ, సందర్భాలూ, ఆస్తికుని గాఢవిశ్వాసానికి ఎలా ప్రతిబంధకాలు కావో ఓపికగా వివరించేవాడు. ఆ ఉపాధ్యాయుడు ఈ కథ చెపుతూండేవాడు :

"నేపిల్స్ - సిసిలీని పాలించే ఒక రాణికి ఒక వ్రణం లేచింది. బాధ భరించలేక, తన ప్రజలందరూ తన బాధోప పశమనానికి ప్రార్థనలు జరిపాలని ఆదేశించింది. ప్రజలందరూ వినమ్రులై హృదయ పూర్వకంగా ప్రార్థనలు జరిపారు. దేశంలోని దుస్తులన్నింటినిండా శిలువగుర్తులు కుట్టబడ్డాయి ఇంతచేసినా, రవ్వంత ప్రయోజనంకూడా లేకపోయింది. ఆమె యిప్పుడు మొనరియల్ సమాధుల్లో శాశ్వత నిద్ర పోతున్నది. 'ఇంక ఏ బాధకూ నేను భయపడను' అనే మాటలు ఆ సమాధిమీద మెరుస్తున్నాయి."

ఇటువంటి అపనమ్మకాలూ, వెక్కిరింపులూ, ఎక్కువై పోవడం చేత తనలో దేదీప్యమానంగా వెలుగుతూన్న అన శ్వర సత్యాన్ని లోకానికి, సాక్ష్యాలతో నిరూపించవలసిన

సమయ మాసన్న మైనదని భావించాడు, జూనిపర్. ఒకసారి తన గ్రామంలో అంటు వ్యాధులు ప్రబలి, అసంఖ్యాకులైన ప్రజలను పొట్టనబెట్టు కున్నాయి. ఆ అవకాశం తీసుకొని జూనిపర్ మరణించిన వారిని - పదిహేను మందినీ - బ్రతికి బయటపడ్డ పదిహేను మందినీ తీసుకొని, వారి జీవిత స్వరూప స్వభావాలను ఒక పట్టికగా తయారు చేశాడు. మంచితనం - మతనిష్ఠ - సాంఘిక ప్రయోజనం - ఈ మూడు విషయాలలూ ఒక్కొక్కటికి పది వంతుల చొప్పున లెఖ్ఖ గట్టాడు.

| | మంచితనం | మతనిష్ఠ | సాంఘిక ప్రయోజనం |
|---|---|---|---|
| అల్ఫాన్సో. జి. | 4 | 4 | 10 |
| నైనా | 2 | 5 | 10 |
| మాన్యూల్ బి. | 10 | 10 | 0 |
| అల్ఫాన్సో వి. | (-) 8 | (-) 10 | 10 |
| పీరా. యస్. | 0 | 10 | 10 |

ఈ విషయం అత డూహించిన దానికంటె కష్టంగా కన్పించింది. ఆ సరిహద్దు ప్రాంతంలో ప్రతి జీవి, ఆర్థికంగా సంఘానికి అత్యవసర మవుతున్నది. అందుచేత పై పట్టీలోని మూడవ వరుస నిరుపయోగమై పోయింది. అల్ఫాన్సోవి వ్యక్తిగత గుణ గణాలను అంచనా వేసేటప్పుడు, జూనిపర్ 'మైనస్' గుర్తులను కూడా వాడవలసి వచ్చింది. అతను పీరా, యస్ వలె కేవలం చెడ్డవాడు మాత్రమే కాదు. అంత కంటే అధ్వాన్నమైన మనిషి. తాను చెడిపోవడమే కాకుండా

యితరులను కూడా చెడ్డ మార్గంలోకి మళ్ళించే బుద్ధి మంతుడు. తాను చర్చికి వెళ్ళడు సరిగదా, యితరులను కూడా వెళ్ళొద్దని ప్రచారం చేసేవాడు. పీరా. యస్. నిస్సంశయంగా దుష్టురాలే. కాని ఆమె మత దీక్ష ఆదర్శ ప్రాయమైనట్టిది. ఈ విధంగా సేకరించిన సమాచారంతో జూనిపర్ ఒక పెద్ద పట్టిక తయారు చేశాడు. చివరికి బ్రతి కున్న వారి పట్టికతో మరణించిన వారి పట్టికను పోల్చి చూచాడు. దాని ఫలితంగా మరణించినవారే, జీవించడానికి అయిదురెట్లు అర్హులని తేలింది. నిజానికి అమూల్యమైన జీవి తాలను బలి తీసుకుంటానికే, ఆ అంటువ్యాధులువచ్చా యని పించింది. ఆరోజు మధ్యాహ్నం పసిఫిక్ సముద్ర తీరాన తారాడుతూ తానింతగా కష్టపడి తయారు చేసిన పట్టికల నన్నింటినీ చించి సముద్రంలో విసరి వేశాడు. ఈ తార్కిక పరిజ్ఞానంలోని అంతరార్థం అతనికి అంతు చిక్కలేదు. అలాగే దిగంతాలలో ముత్యాల సరుసలవలె నింగిలో తేలి పోతూన్న మబ్బు దొంతరల సౌందర్యాన్ని చూస్తూ ఒక ప్రసన్న భావ ముద్రలో మునిగి పోయాడు. ఇంక తార్కిక వాదాలతో తన ప్రగాఢ విశ్వాసాన్ని బలహీనం చేసికోలేక పోయాడు. విశ్వాసాలకూ, వాస్తవ విషయాలకూ మధ్య అగాధం ఎన్నడూ అనుకున్న దాని కంటె ఎక్కువగానే ఉంటుంది.

కాని శాన్‌లూయీ రే వంతెన కూలిపోవడాన్ని గురించిన పరిశోధన జరుప వలసిన విధానం – ఒకానొక సంఘటన వల్ల జూనిపర్ గ్రహించ కల్గాడు.

ఇంతకు ముందు చెప్పిన శాన్‌మార్టిన్ విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుడు ఒకనాడు లీమాచర్చి సమీపంగా నడచి వెళ్ళుతున్నాడు. అప్పుడాతనికి ఒక స్త్రీ యొక్క సమాధి కన్పించింది. దాని రాతి ఫలకం మీద ఆ స్త్రీని గురించి కొన్ని ప్రశంసా వాక్యాలు చెక్కబడి ఉన్నాయి. ఇరవై సంవత్సరాల పాటు కుటుంబానికి ఆమె గృహలక్ష్మిగా వెలుగొందిందనీ, బంధు మిత్రులకూ, అతిథులకూ అభిమాన పాత్రురా లయిందనీ - సౌందర్యం - సుగుణ సంపత్తి - ఆమెలో మూర్తీభవించాయనీ - ఆమె అక్కడ ఏసు ప్రభువు పునరాగమనం కోసం నిరీక్షిస్తోందని - వర్ణించబడింది. ఈ వాక్యాలను స్పందిస్తున్న పెదిమలతో - ఉత్కంఠతో ఆ ఉపాధ్యాయుడు చదివాడు. ఆ పొగడ్తలను చూసే సరికి అతగాడి వళ్ళు మండిపోయి "ఎంత సిగ్గుచేటు! లోకంలో అందరూ ఎవరిసుఖం వారు చూసుకుంటూ బ్రతుకుతున్నారని ప్రతి వారికీ తెలుసు. స్వార్థ త్యాగాన్ని వలికిస్తూ, యీకథ లల్లటం ఎందుకోసం? ఆమె నిస్వార్థ శీలాన్ని గురించి యింత బూటకమైన ప్రచార మెందుకో?" అని కేకలు పెట్టాడు.

అలా అంటూ, ఆ మాటలు చెక్కిన శిల్పుల బూటకాన్ని బయట పెట్టా ననుకున్నాడు. ఆ స్త్రీ మరణించి పన్నెండు సంవత్సరాలే అయింది. ఆమె నౌకర్లనూ స్నేహితులనూ, బిడ్డలనూ అతను కలుసు కున్నాడు. కాని ఎక్కడికి వెళ్ళినా, ఎవరి నోటంట విన్నా ఆమె సుగుణ శీల సౌరభం గుబాళిస్తూనే ఉంది. ఆమె ప్రసక్తి విని, ఆమె

ఉత్తమ వ్యక్తిత్వాన్ని తలచుకొని, విషాదంగా మందహాసం చేయని వారంటూ లేక పోయారు. చెమ్మగిల్లని కళ్ళు కని పించలేదు. ఆమెను చూడని, ఆమె మనుమలు గూడా అటువంటి మంచిమనిషి ఉంటుందా అని ఆశ్చర్య పోయారు. ఆ ఉపాధ్యాయుడు దిగ్భ్రాంతుడై నిలబడి చివరకు "ఆ! నేను అన్నదే యదార్థం. ఈ స్త్రీ అందుకు ఒక అపవాదం కావచ్చు. అంతే!" అనుకున్నాడు.

ఇదే పద్ధతిలో - వీరినిగురించి గ్రంథ రచన సాగించ టంలో జూనిపర్ ఎంతో శ్రద్ధ తీసుకున్నాడు. ఏ చిన్న విషయాన్ని విస్మరించినా ఫలితాలు మారిపోవచ్చు. అతడీ విషయంలో శ్రమించినకొద్దీ, మార్గం క్లిష్టమౌతూ వచ్చింది. చిన్నచిన్న విషయాలుగానే కన్పిస్తూ, సరిగా సర్దుబాటు చేసినప్పుడు ముఖ్యాంశాలుగా పరివర్తన చెందుతున్న అనేక విషయాలు అతన్ని మోసం చేస్తున్నాయి. అందుచేత ఇందుకు సంబంధించిన విషయా లన్నింటినీ అతడు ఒకచోట పొందు పరిచాడు. వాటిని ఒకటికి పదిసార్లు చదివినప్పుడు, అందులోని రహస్యాలు వాటంతట అవి బయట పడవచ్చు నని అతని భావం. మార్కెస్సా డి మాంటి మేయరు - కేవలం బియ్యం, చేపలూ, పండ్లూ - మాత్రం భుజిస్తూ జీవించేదని ఆమె వంటవాడు చెప్పాడు. ఈ విషయం ఏనాటికైనా, ఆమెలోగల ఆధ్యాత్మిక ప్రవృత్తిని బహిర్గతం చేయవచ్చు ననే అభిప్రాయంతో - దాన్నికూడా పదిలంగా పొందుపరిచాడు. విందులకూ వినోదాలకూ, పిలవని పేరం టంగావచ్చి, ఏ చెమ్చాలో దొంగిలించుకుపోవడం ఆమె

కలవాటని జాన్ రూంచిరోమో సాక్ష్యమిస్తున్నాడు. పట్టణ సమీపంలోని ఒక మంత్రసానిని డోనామేరియా కలుసుకుని పనికిమాలిన ప్రశ్నలు వేయడం మొదలు పెట్టిందట! ఆ ధోరణి సహించలేక, ఆమెను తన గదిలోంచి గెంటివేసినట్లు ఆ మంత్రసాని చెప్పింది. లీమాలోగల మిక్కిలి సంస్కారం గల ముగ్గురు వ్యక్తులలో ఈమె ఒకతెయని, గ్రంథవిక్రేతలు చెబుతున్నారు. ఆమె మందమనుపు మనిషిఅయినా, చాలా మంచిదని ఆమె రైతుభార్య అభిప్రాయం. జీవిత చరిత్రలు వ్రాయడం మామూలుగా అనుకున్నంత తేలిక విషయం కాదు!

మరణించిన వ్యక్తులకు అత్యంత సన్నిహితులైన వారి దగ్గర రాబట్టగల సమాచారం అతిస్వల్పమైనదని జూనిపర్ గ్రహించాడు. పెపీటానుగురించి మేడ్రిడిమేరియా డెల్‌పిలార్ ఎంతోసేపు మాట్లాడింది కాని, ఆమెపై తాను పెట్టుకున్న ఆశ లెటువంటివో మాత్రం బయట పెట్టలేదు. పెరికోల్ యిప్పుడు తన్ను అభిమానిస్తూనా్న, మొదట ఆమెను కలుసుకోవడమే కష్టమయింది. పియోమామాను గురించి, అతడు యితరత్రావిన్న లజ్జాకరమైన విషయాలకు విరుద్ధంగా వేనోన్న మంచి సంగతులు పెరికోల్ చెప్పింది. ఆమె తన బిడ్డనుగురించి చెప్పిన సంగతులు చాలా తక్కువ. అవన్నీ బాధతో నిండిఉన్నాయి. అందువల్లనే ఆమెతో జూనిపర్ జరిపిన సమావేశం మధ్యలోనే ఆగిపోయింది. ఎస్టబాన్ గురించీ, పియోమామాను గురించీ, కెప్టెన్ అన్వార్డో ఏవో కొన్ని విషయాలు చెప్పాడు. కాని ఎక్కువ విషయాలు

తెలిసిన వ్యక్తులు – ముందుకు వచ్చి చెప్పటానికి చొరవ చూపటం లేదు.

జూనిపర్ సూత్రీకరించిన సిద్ధాంతాలను వర్ణించి మీకు బాధకలిగించను. అవి ఎప్పుడూ మనకు తెలుసు. ఈ సంఘటనలో దుష్టశిక్షణ జరిగి, శిష్టులకు స్వర్గలోకానికి పిలుపు వచ్చిందని – అతడు తేల్చి చెప్పాడు. ఈవిధంగా లోకానికి ఒక గుణపాఠం చెప్పటం జరిగిందని అతని భావం. కాని జూనిపర్‌కు అంతటితో సంతృప్తి కలగ లేదు. మార్క్వెస్సా డిమాంటి మేయర్ పేరాశగల జీవి కాక పోవచ్చును. అలాగే పియోమామ వ్యసనపరుడు కాక పోవచ్చును.

ఆకస్మికంగా ఈ గ్రంథం కొందరు న్యాయమూర్తుల కళ్ళలోపడి, మతవిరుద్ధమైనదని ప్రకటించ బడింది. దాన్ని రచయితతో పాటు బహిరంగంగా తగలబెట్టాలనే నిర్ణయం జరిగింది. ఈ నిర్ణయాన్ని జూనిపర్ శిరసావహించాడు. ఆ చివరినాటిరాత్రి, అంధకారబంధురమైన కారాగారంలో కూర్చుని, తాను విచారించిన అయిదుగురి జీవితాలలో కని పించని రహస్యం తన జీవితంలో ఏదన్నా కన్పిస్తున్న దేమో నని ఆత్మపరీక్ష చేసికొన్నాడు. తిరుగుబాటుధోరణి అతనిలో లేదు. మత పవిత్రతకోసం తన జీవితా న్నర్పించడానికి అతను సిద్ధంగా ఉన్నాడు. కాని తానుచేసిన కృషి యావత్తూ మతాన్ని బలపరచడానికన్న విషయం ఒక్కరైనా నమ్మితేచాలు. ఈ పృథ్విలో తనను నమ్మేప్రాణి లేదను కున్నాడు. కాని మరునాటి ఉదయం, అరుణోదయ శోభలో

గుమిగూడిన ఆ జన సందోహంలో, తనపై నమ్మకం కలిగి, తనను ప్రేమిస్తున్న వ్యక్తులెందరో అతనికి కన్పించారు. జూనిపర్‌ను కడసారి దర్శించడానికై పూరెటో గ్రామంనుంచి ఒక ప్రతినిధివర్గం వచ్చింది. జూనిపర్‌కు జీవితంనుండి, అగ్ని జ్వాలల్లో విముక్తి కలిగిస్తున్న దృశ్యాన్ని చూస్తూనేనా—(ఆమె మంచితనం 2 మతనిష్ఠ 5 సాంఘిక ప్రయోజనం 5) తక్కిన ప్రజలు దిగ్భ్రాంతులైపోయారు. ఆసమయంలో — ఆసమయంలోకూడా తనను సెయింట్ ఫ్రాన్సిస్ ఖండించి ఉండేవాడుకాదనే. ప్రగాఢవిశ్వాసం అతని హృదయంలో తగ్గలేదు. అంతకంటే పెద్దపేరు (ఏసుక్రీస్తుది) సంస్మరించే ధైర్యం అతనికి లేకపోయింది. రెండుసార్లు సెయింట్ ఫ్రాన్సిస్‌ను స్మరించుకుంటూ చిరునవ్వులతో ఆ అగ్ని జ్వాలలకు ఆహుతి అయిపోయాడు.

* * * *

వంతెన కూలిపోగా మరణించినవారి ఆత్మశాంతికై ప్రార్థనలు జరిగిననాడు వాతావరణం ప్రశాంతంగా ఉంది. లిమియన్లు వచ్చి చర్చిలో దిగ్భ్రాంతులై నిలబడ్డారు. అద్భుతమైన దుస్తులు ధరించిన అర్చిబిషప్- తన ఆసనంలో కూర్చున్నాడు. థామస్‌లూయీ తన పోషకురాలూ, స్నేహితురాలూ అయిన ఆస్ట్రియా మహారాణికివీడ్కోలిచ్చిన సందర్భంలో వ్రాసిన గీతం ఆలాపించ బడుతున్నది. అంతు లేని బాధ, అందలి తీయదనం - ఇటాలియన్ ధోరణిలోకి మలచబడిన స్పానిష్ వాస్తవికత ఆగీతంలో నిండివున్నాయి. రాజలాంఛనాలను ధరించి విచ్చేసిన డాన్ అండ్రెస్‌కు ముళ్ల

మీద కూర్చున్నట్లుగా ఉంది. వచ్చినవారంతా రహస్యంగా తనను చూస్తూనే ఉంటారని అతనికి తెలుసును. పోయిన బిడ్డకు (జైమ్) తాను తండ్రిగా వ్యవహరిస్తాడేమోనని వారు ఎదురుచూస్తూంటారు. పెరికోల్ వచ్చిందేమోనని అతడాశ్చర్యపడుతున్నాడు. అంతసేపు పొగపీల్చకుండా అతడెప్పుడూ ఉండలేదు. కెప్టెన్ అల్వార్డో ఎండలోంచి లోపలకువచ్చి, వంచి ప్రార్థనలు చేస్తున్న తలలనుచూచి "ఎంత నటన! ఎంత అసత్యం" అనుకుంటూ గిరుక్కున వెనక్కు తిరిగాడు. అక్కణ్ణుంచి సరాసరి సముద్రం దగ్గరకుపోయి, తన పడవ అంచున కూర్చొని, క్రిందగల నిర్మలమైన నీటిలోకి చూస్తూ "మునిగిపోయినవారే అదృష్టవంతులు ఎస్టబాన్." అనుకున్నాడు. మఠాధ్యక్షురాలు, తన పరివారంతో కలసి తెర వెనుక కూర్చున్నది. ఆరాత్రి ఆమె హృదయంలోని ఆదర్శమూర్తిని పెకలించివేసుకుంది. దాని ఫలితంగా పాలి పోయింది. కాని నిశ్చలంగానే ఉంది. తాను తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా సాగుతుందా లేదా అని అనుకోవడం పొరపాటు అని ఆమె అంగీకరించింది. ఫలితంకోసం ఆరాట పడకుండా పనిచేయుటమే తన కర్తవ్యం. ఎన్నటికీ కోలుకొన లేని రోగగ్రస్థులకు తను సంరక్షకురాలు. ఎన్నడూ ఎవ్వరూ లోపల అడుగుపెట్టని దేవాలయానికి ఆమె పూజారిణి. తన కార్యక్రమాన్ని విస్తృత పరచటానికి యింక పెపీటా లేదు. మిగిలిపోయిన తన సహచరులలో అశ్రద్ధ పెరిగి పోతోంది. ఒక్క నిముషంపాటు స్వార్థరహితమైన ప్రేమ ఆమెలో పెల్లుబికింది. నుదుటిపై చేయి వేసుకొని "నిన్నంతకంటే ప్రేమగా

చూసుకో వల్సింది 'పెపీటా! నా జీవితంలో ఆగుణం యింకా స్త ఉండవల్సింది. కాని నాకు తీరిక లేకపోయింది." అంటూ పశ్చాత్తప్త హృదయంతో, ప్రార్థనలలో మునిగి పోయింది మేడ్రిడి మేరియా డెల్ పిలార్.

కెమీలా పెరికోల్ కూడా నాడు చర్చికి బయల్దేరింది. ఆమె హృదయమంతా భయంతో, ఆశ్చర్యంతో నిండి పోయింది. ఆమెకు మళ్ళీ ఆకాశవాణి ఏదో వినిపించింది. తనకు మశూచి వచ్చినప్పుడు - జైమ్‌కు జబ్బు చేసి నప్పుడు - వంతెన కూలినప్పుడు - అలా మూడుసార్లు వినిపించింది. ఇవి ప్రమాదాలు మాత్రం కావు. ఆమె సిగ్గుతో క్రుంగి పోయింది. అది స్పష్టంగా బయటకు కన్పించింది. తన కుమాళ్ళ నిద్దరినీ స్పెయిన్‌లోని కాన్వెంటు పాఠశాలకు పంపాలని వైస్రాయి నిర్ణయించినట్లు రాజభవన్ నుంచి ప్రకటన వెలువడింది. బాగానే వుంది. ఆమె యింక ఒంటరిదై పోయింది. అలాగే ఆనాడు చర్చికి బయలు దేరింది. అలసిపోయి, మార్గ మధ్యంలోని శాన్ లూయీ రే చర్చి స్తంభానికి కాస్సేపు ఆనుకు కూర్చున్నది. తన కాత్మీయమైన చీకటిలో కలసి పోయిన ఆ రెండు ముఖాల రూపు రేఖలను తన స్మృతి పథంలో పోల్చుకుంటానికి ప్రయత్నించింది. "నాకేమీ అనిపించటం లేదు. నాకు హృదయం లేదు. నిరర్థకమైన జీవితం నాది. నేను కఠిన పాషాణాన్ని. ఏ విషయాన్నీ యింక ఆలోచించను. ఇక్కడ యిలాగే విశ్రాంతి తీసుకుంటాను" అంటూ గొణుక్కుంది.

ఆ క్షణంలో ఆమె హృదయంలో వర్ణించ నలవిగాని వెర్రి బాధ చెలరేగింది. పియోమామాకు తనపై గల ప్రేమను - ఒక్కసారి చెప్పలేని బాధ - జబ్బులో నున్న జైమ్ నొకసారి - అనునయించలేని అడవి మంటలాంటి బాధ - ఆమెలో ప్రజ్వరిల్లింది. "నేను అందరికీ ఆశా భంగం కల్గించాను. వారు నన్ను ప్రేమించారు. నేను ప్రేమించ లేక పోయాను" అంటూ వెనక్కి తిరిగి వచ్చే సింది. ఒక సంవత్సరం వరకూ ఆదే నిస్పృహలో ఆమె కృంగిపోతూ ఉన్నది. మఠాధ్యక్షురాలు కూడా, ఆమె కత్యంత ప్రేమ పాత్రులైన యిద్దరు వ్యక్తులను అదే ప్రమా దంలో కోల్పోయిందని, సందర్భ వశాన పెరికోల్ విన్నది. ఆమె చేతిలోని అల్లిక సూది జారి క్రింద పడింది. "ఆమెకు తెలుస్తుంది. ఆమె చెప్ప గలదు - ... కాని ఆమె చెప్పే దేముంది ? నాలాంటి నికృష్టురాలు, ఒకరిని ప్రేమించిందన్న మాటే ఆమె విశ్వసించ లేదు" అనుకుంది. అయినా లీమా పోయి దూరాన్నుంచైనా మఠాధ్యక్షురాలిని చూడాలని నిశ్చ యించుకుంది. "ఆమె ముఖం ప్రసన్నంగా నుంటే ఆమెను కలుసు కుంటాను" అనుకున్నది.

కెమీలా వెంటనే బయలుదేరి - కాన్వెంటు దగ్గ రకు వెళ్ళింది. ఒక మారుమూల పొంచి నిలబడి మఠా ధ్యక్షురాలిని చూసింది. ఆమె ప్రశాంత వదనం - కొంచెం భయం కల్గించినా ప్రేమాస్పదంగానే కన్పించింది. చివరకు సాహసించి ఆమెను కలుసుకుంది.

"తల్లి ! నేను - నే - ను"

"ఎవరమ్మా - ?"

"నేను నటిని - పెరికోల్‌ను"

"ఔనా ! నిన్ను చూడాలని ఎప్పుడో అనుకున్నాను. కాని నువ్వు ఎవరినీ చూడదల్చుకోలేదని విని ఊరుకున్నాను. శాన్‌లూయీరే వంతెన ప్రమాదంలో నువ్వుకూడా యిద్దర్ని ...... ఔనమ్మా ! విన్నాను."

కెమీలా ఉద్రేకంగా లేచి నిలబడింది. మళ్ళీ అదే వెర్రి బాధ ! అంధకారంలో అదృశ్యమై పోయిన వారి దగ్గరికైనా తాను వెళ్ళలేదు. ఆమె పెదిమలు పాలి పోయాయి. మఠాధ్యక్షురాలి ఒడిలో తలదాచుకుని "అమ్మా! నే నేంచెయ్యనమ్మా ? నాది ఒంటరి బ్రతుకై పోయింది. ఈ పృథ్విలో యింక నా కేముంది ? ఏం చూసుకొని జీవించాలి ? వారిని నేను ప్రేమించాను. కాని యిప్పు డేంచేయ గలను ?" అంటూ విలపించింది పెరికోల్.

మఠాధ్యక్షురాలు, ప్రశాంత వదనంతో పెరికోల్‌ను అనునయిస్తూ "తల్లీ యిక్కడ ఉక్కగా ఉంది. తోటలోకి వెళ్ళుదాం పద. అక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకుందువు గాని." అంటూ ఒక అమ్మాయికి నీరు తెమ్మని సైగ చేసింది. ఆ తరువాత గూడా యింకా అలాగే మాట్లాడుతూ "నిన్ను ఎప్పుడో చూడవల్సిన దాని నమ్మా - ఈ ప్రమాదం జరగక ముందే నిన్ను చూడా లనుకున్నాను.

కాని తల్లీ - ప్రేమలో - అన్ని తప్పులూ అదృశ్యమై పోతాయమ్మా"

క్లేరా తన తల్లి వ్రాసిన చివరి ఉత్తరం మఠాధ్యక్షు రాలికి చూపింది. పెపీటా యజమానురాలి హృదయం నుండి, అటువంటి అద్భుతమైన భావాలు పెల్లుబికిన సంగతి తెలుసుకొని, మఠాధ్యక్షురాలు ఆశ్చర్య చకితురా లయింది. ఆనాటినుంచీ ఆ లేఖలను చూసి - యావత్ప్రపంచమూ ఆశ్చర్య పోతూనే ఉన్నది.

"ప్రపంచంలో ఏ మారుమూలలనైనా దివ్య సౌంద ర్యం దాగి ఉండవచ్చును" అనుకుంది మఠాధ్యక్షురాలు. ఆమె పసి పిల్లలా ఆనందంతో ఉక్కిరి బిక్కిరై పోయింది.

"మేం చేస్తున్న పని చూద్దువుగాని రా తల్లీ" సూర్యుడు అస్తమించాడు. మఠాధ్యక్షురాలు దీపం పుచ్చు కుని డోనా క్లేరాకు అన్ని గదులూ చూప సాగింది. యువ కులూ, వృద్ధులూ, రోగులూ, అంధులూ ఎందరో కన్పిం చారు.

ఒకొక్కచోట మఠాధ్యక్షురాలు ఆగిపోయి "చెవిటి వారికీ మూగ వారికీ ఏదో ఒక మేలు చేయవచ్చు నను కుంటాను. ఓపికగలవ్యక్తి వకరు యిందుకు సిద్ధపడాలి. వారికి ఒకభాష నేర్పెట్ట వచ్చును. ఇటువంటి దురదృష్ట వంతులు పెరూలో వందలూ వేలూ ఉన్నారు. స్పెయిన్‌లో వీరి కెవరన్నా నివారణోపాయం కనిపెట్టారేమో నీకేమన్నా తెలుసా?... సరే — ఎప్పటికైనా ఎవరో ఒకరు కనిపెట్ట గలరు."

కొంచెం సేపయ్యాక ఆమె మళ్ళీ "ఈ పిచ్చి వారికి కూడా ఎప్పటికైనా ఏదో పరిష్కార మార్గం కనిపెట్ట వచ్చునని నే ననుకుంటున్నాను. నేను పెద్దదాన్ని అయిపోయాను. ఇంక తిరగలేను. బహుశః యిప్పుడు స్పెయిన్‌లో కొంత పరివర్తన జరిగిన దనుకుంటాను. ఇటువంటి దురదృష్ట వంతులపై సానుభూతి చూపడం అలవాటు అయిందను కుంటాను. ఇందులో మనకు అర్ధంకాని ఏదో నిగూఢ రహస్యం దాగి ఉందని నా అభిప్రాయం. వారికి మేలు కల్గించే వార్త ఎప్పుడన్నా స్పెయిన్‌లో నీ చెవిన పడితే-వెంటనే నాకు జాబు వ్రాయి... నీకు తీరిక ఉంటే..."

చివరకు పంటగది కూడా డోనాక్లేరా చూసిన తర్వాత ఇప్పుడు నేను రోగుల దగ్గరకు వెళ్ళి, నిద్ర రాని సమయాల్లో స్మరించుకో వలసిన విషయా లేమిటో చెప్పి వస్తాను. నాతో నువ్వక్కడకు రావద్దు. అటువంటి దృశ్యాలు చూడటం నీ కలవాటు లేదు. అలాంటి శబ్దాలు నువ్వు వినలేవు. పసి పిల్లలతో మాట్లాడినట్లుగా 'వాళ్ళతో నేను మాట్లాడాలి" అంటూ మందహాసం చేసి వెళ్ళిపోయింది మతాధ్యక్షురాలు. కాని . మరు క్షణంలో ఒక వ్యక్తిని వెంటబెట్టుకొని తిరిగి వచ్చింది. ఆమెకూడా వంతెన ప్రమాదంలో నష్ట పడింది. ఒకా నొకప్పుడు గొప్ప నటి. మతాధ్యక్షురాలు మాట్లాడే టప్పుడు డోనాక్లేరా తలుపును ఆనుకొని నిలబడి ఉంది. ఆమె ప్రక్కనే నేలమీద లాంతరు వెలుగుతున్నది. మేడ్రి మేరియా ఒక స్తంభాన్ని ఆను కొని నిలబడి ఉంది. రోగగ్రస్థు లెందరో వరుసగా పడు

కొని తెరిగా చూస్తున్నారు. చీకట్లో కలిసి పోయిన తన ఎస్టబాన్ గురించీ- తన పెపీటాను గురించీ ఆ రాత్రంతా ఆమె ఆలోచిస్తూనే ఉంది. ఇప్పుడు వారింక లేరు. తనదగ్గరకు రారు. వారికీ ప్రపంచం నిరర్థకంగా, క్లిష్టంగా కనిపించింది. తన సంరక్షణలో ఉన్న రోగులంతా నేడు నాల్గు గోడల మధ్య సుఖంగా ఉన్నామని అనుకుంటున్నారు. తిరిగి ఆరోగ్యం వచ్చినా, మృత్యువు వచ్చినా, వారీ సుఖాన్ని త్యాగం చెయ్యలేరు. ఆమె మాట్లాడుతున్నప్పుడు గూడా, ఆమె మనః పథంలో వెనుకగా ఏవో ఆలోచనలు దూసుకు పోతూనే ఉన్నాయి. "ఇప్పుడీ లోకంలో నేనుతప్ప పెపీటాను గాని, ఎస్టబాన్‌ను గాని గుర్తుంచుకున్న వారెవ్వరూ లేరు. పిరూమామనూ, డాన్ జైమ్‌నూ మరచిపోనివ్యక్తి కెమీలా మాత్రమే. ఈ డోనాక్లేరా తన తల్లిని మరచిపోలేదు. కాని అనతికాలంలోనే మేమందరం తనువు చాలిస్తాం. ఆ అయిదుగుర్ని గురించిన స్మృతులూ మాతో బాటు కాల గర్భంలో అదృశ్యమైపోతాయి. మమ్మల్నికూడా కొంత కాలంపాటు ఎవరో ప్రేమిస్తారు. తరువాత మరచిపోతారు. అంతే. కాని ఆ ప్రేమ చాలు. ఆ ప్రేమంతా దాన్ని సృష్టించిన విశ్వప్రేమలో విలీనమై పోతుంది. ప్రేమకు స్మృతికూడా అవసరంలేదు. బ్రతికి ఉన్నవారికి ఒక లోకంవుంది. తనువు చాలించినవారికి పరలోకలోకం ఉంది. ఆ వంతెన ప్రేమకు చిహ్నం. అది శాశ్వతమైనది. అదే దీని పరమార్థం....